ఎంబెరుమానారు సర్వేశ్వరునికి శ్రియఃపతిత్వము కలుగఁ జేసి యతని సంబంధమైన శ్రీవైష్ణవజాతి కల్మషములఁ దోలిసి పావనము చేసిరనియు శ్రీభాష్యముచేసి స్తోత్రముచేయఁ బడిన యెంబెరుమానారు శ్రియఃపతిని నిత్యమును మంగళాశాసనము చేసిరనియు మఱియు నెంబెరుమానారు శ్రియఃపతి కైంకర్య సామ్రాజ్య మేలినవారనియు శ్రీపెరుంబూదూరికి గర్తనైన యాసూరి కేశవాచార్యుల తిరువంశము వర్ధనమగునటుల యవతారమైరనియు శ్రియఃపతి మనంబునకు నిష్టమైన కైంకర్యము లాచంద్రతారార్కముగ నిలిపిన వారనియు, పెరియపిరాట్టికి సదృశమైన కృపగలవారనియు కూరత్తాళ్వానులును తిరుక్కురు కైపిరాన్ పిళ్ళానువీరు మొదలైన వారికి నాచార్యులైరనియు నిట్టిభాష్యకారు లెంబెరుమానారు జీయరు హృదయంబునఁ బూర్ణులుగా వేంచేసియుండిరని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ (ఎంబెరుమానారులు సర్వేశ్వరుని కిష్టమైన కైంకర్యంబులు చేసిరని యానతిచ్చి వారి యవతారముపొంద నానతిచ్చుచున్నారు.)

సీ॥ భూత పురాధ్యక్ష భూసుర్తోత్తము కేశవాఖ్యత నూజేఁయాళువారె। చైత్రమాసార్ద్రిక్ష సంభూతవిశ్రుత వేదాంతతత్త్వార్థ విమలచరిత। భాష్యకారయతీంద్ర భాగవతోత్తములభ్యరామానుజలక్ష్మణార్య। శ్రీతిరంగేశ్వరార్పిత విభూతిద్వయ తేజోబలాకాంత దివ్యకేశ। చతురయెంబెరుమానారై సర్వలోక। దేశికోడయవరు నామధేయదయను। మమ్మురక్షింపవచ్చిన మాధవుఁడవు। దిక్కుటనీవను లక్ష్మణదేశికుండ॥ ౨

తా॥ శ్రీపెరుంబూదూరి యందు బ్రాహ్మణోత్తముండైన యాసూరి కేశవాచార్యులకుఁ గుమారుండై యిళయాళ్వారు తిరునామము గలిగిన వారనియు చైత్రమాసమున నార్ద్రానక్షత్రమం దవతరించి సకలమైనవారు వేదాంతమును నెఱుఁగునట్లు శ్రీభాష్యముచేసిరనియు అందువలన శ్రీభాష్యకారులై జీయరులకెల్లను శ్రేష్ఠులైనవారయిరి పెరియనంబిగారిచేత రామానుజులని దాస్యనామ మునుపఁబడి భాగవతోత్తములచేతఁ దలఁచుగా సేవింపఁ బడిరనియు తిరువరంగ పెరుమాళ్లరయరు వలన ద్వయార్థమును లభించుకొను నపుడు లక్ష్మణమునియను దాస్య నామము వడసెరనియు నంబెరుమాళ్లు తనివైభవముఁ గటాక్షించి యుభయ విభూతులు మీకిచ్చెముఁ జేసితిమని యుడయవరులని యానతిచ్చిరనియు నిటువలె సేర్పరియైన యెంబెరుమానారు సర్వలోకములకుఁ గర్త యుడయవరనియు నివి మొదలైన తి

రునామములు గలిగి మమ్మురక్షింపవచ్చిన మాధవుఁడే గనుక దిక్కు- మహాత్ముండే కానిమఱిలేరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( ఎంబెరుమానారు తిరునామముల వైభవము లానతిచ్చి సన్నిధిని సెప్పుచును సేవించుచుండెడి పెద్దల తిరువాలక్కుము లెక్కమీఁద నానతిచ్చుచున్నారు॥).

సీ॥ దాంతి సప్త శతత్రిదండ సన్న్యాసులు తమ చుట్టులను బ్రబంధములు చదువ । వెనుదగిలి పంద్రెండువేల యేకాంగులు బహు భంగులను దమపనులుసేయ । స్థిరచతుస్సప్తతి సింహాసనస్థులై యాచార్య లీలోకమాక్రమించి । కపిసేన భంగిని గణనకశక్యమై విష్ణుభక్తులు భూమివెల్లి విఱియ । భాష్యకారులు వేద విభ్రమలు దీర్చి । కూరనాథాదులును దాము గూడిభగవ దనుభవానంద మగ్నులై యనవరతము । నుందురని చెప్పె లక్ష్మణయోగివరుఁడు॥ ౩

తా॥ ఎంబెరుమానారు చుట్టు ప్రకారలను ఏడు నూఱుల త్రిదండ సన్న్యాసులు దివ్యప్రబంధము లధ్యయనములు చేయుదురనియు పంద్రెండువేల యేకాంగులు బహు విధములైన కైంకర్యములు సేయుదురనియు ఆచార్య పురుషులగు డెబ్బదినాల్గురు సింహాసనస్థులును నీ లోకమాక్రమించి రనియు గృహస్థులైన శ్రీవైష్ణవులును · దిరునామధారులును గపిసేనవలె లెక్కకెక్కువనై విష్ణుభక్తులు భూమినివెల్లి విఱిసి రనియు నీతీరున భాష్యకారులు శిష్యులఁ గూడుకొని వేదాంతార్థము నెఱుఁగ వేదవేత్తల భ్రమలుదీర్చిరనియు కూరత్తాళ్వారులును దామును గూడి భగవంతుని కల్యాణగుణముల ననుభవించు చుండిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( ఎంబెరుమానారు శిష్యసంఖ్యనానతిచ్చి పెరుమాళ్ళు సర్వేశ్వరుఁ డెంబెరుమానారు నాశ్రయించిన యా చరణములుమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ వరద రంగేశ్వర వనశైల పతులును యాదవ వృషభాచలాధిపతులు । కోరితిరుకుఱుంగుడి నంబిశిష్యులై యపుడాచరించిన యాచరణలు । రక్షమూఁగ బ్రహ్మరాక్షస శారదాప్రభృతులు నూర్జితబ్రాహ్మణులును । నాథయామునపెరియనంబి ప్రభృతులైనపూర్వులు సమకాలభూసురులును । వెనుకభట్టరు వేదాంతి వీరుమొదలు । బయలుపెట్టిన దివ్యప్రభావమెఱిఁగి । మగ్నులై భాష్యకారుల మహిమఁదగిలి । యుండునెప్పుడు లక్ష్మణ యోగివరుఁడు॥ ౪

తా॥ నంబెరుమాళ్ళును దేవప్పెరుమాళ్ళును దిరువేంగడ ముడయాను

జెల్వపిళ్ళ రాయఁడును అళఘురును తిరుక్కుఱుం గుడి నంబియు వీరు మొద లైన వారర్చావతారమైన శ్రియఃపతి యెంబెరుమానారు పట్లనాచరించిన యాచరణములు మూఁగను రక్షించినదియు బ్రహ్మరాక్షసునకు ముక్తి నిచ్చినది యు శారదను కటాక్షించినదియు నద్వైతవాదులనెడి చార్వాకుల గెల్చినది యు శ్రీమన్నాథమునులను శ్రీయాళవందారులను పెరియనంబిగారు మొదలైన మహాత్ములును నను కాలమందు బ్రాహ్మణులును వెనుక భట్టరును నంజీయ రును వీరు మొదలైనవారు బయలు పెట్టిన దివ్యప్రభావ మెఱిఁగి వారికృపకు మగ్నులైన యెంబెరుమానారు జీయరు తగిలియుండు నెప్పుడని లక్ష్మణార్య లానతిచ్చిరి॥ (ఎంబెరుమానారు వైభవమానతిచ్చి కొంచెపు జాతులకుఁ బ్రప త్తియే సాధనమని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ నిష్కృష్ట వేష సన్నిహిత ప్రపదనవిద్యా క్రమవిశిష్ట విష్ణు భక్తి। రూపసాధననిష్ఠ రోష మత్సరహీన సజ్జన బృంద సంస్తవ విశేష। స న్నుత త్రిభువన సన్మతజ్ఞానాది పరిపూర్ణ నిజకృపా పాత్రనిఖిల। సంరక్ష ణోచిత సౌకర్యగుణజాల సంకీర్ణనిర్మల చారుహృదయ। భక్తజనమోదదా యక పాపహరణ। చతురచతురక్షరోపేత సరసనామ। ధేయయతికులనా యకదివ్యమహిమఁ। దెలిపి చెప్పును లక్ష్మణ దేశికుండు॥ ౫

తా॥ కొంచెపు జాతులు హెచ్చుజాతులను నాశ్రయించినఁ బ్రపత్తి కిసమమై యొకటే ఫలము నిచ్చుననియు విష్ణుభక్తికి సాధనాంతరములై న కోప మత్సరములు మాని సజ్జనులచేత స్తోత్రము చేయఁబడియుండురని యు మూఁడులోకములకు సమ్మతముగు నట్లు జ్ఞానాదిగుణములచేతఁ బరిపూ ర్ణమైన నిజకృపకుఁ బాత్రులైరనియు సమస్తాత్మలను రక్షించెడి కొఱకు సౌకర్యమైన కల్యాణగుణముల సమూహము గలవారనియు నిర్మల హృద యులైన తమదాసులకు మోక్షమొసఁగు వారనియు సమస్త పాపములను నేర్పున నాశనముఁ జేసెడు చతురక్షర మంత్రమునకుఁ గర్తయైన తిరునామ ముగల యెంబెరుమానారు వైభవము తెలిపిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఈ తీరునఁ జతురక్షర మంత్రమునకుఁ గర్తయైన యెంబెరుమానారు వైభవము లానతిచ్చి యెంబెరుమానారును జక్రవర్తినిగా మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ధార్మిక లక్ష్మీక దాస్యాభి ధాఖిల సామ్రాజ్య గురుజన సమభి షిక్త। స్వానురక్తైకాంతి సంఘవాజిసమేత ఘనతరసన్యాసి గజసమూహ రమ్యసదాచార్య రథికసమావృతదాంత భాగవతపదాతివర్గ। సహితనిజాచా

ర్య చరణమౌళివిరాజమాన దిగంతరమహితకీర్తి | పాదుకీభూత కూరేశ పాలితోమ్య | తాశ్రయాఖిల జనలోకయతివరాఖ్య | సార్వభౌమునికృప యాశ్మ సంపదలకు | మూలమని చెప్పె లక్ష్మణమునివరుండు ॥ ౬

తా॥ శ్రియఃపతి దాస్యమనెడు పేరుగల సర్వగాజ్యమునకు గురువులు పట్టాభిషేకముఁ జేసిన యెంబెరుమానారనియెడు రాజు సింహాసనము నందుఁ గూర్చున్న వారనియు అనురక్తులైన యేకాంగులనెడు గజ్జముల సమూహమును సన్యాసులనియెడి యేనుఁగుల సమూహమును నాచార్యపురుషులనెడి రథములును శ్రీవైష్ణవులనియెడి కాల్బలమును దమ శిరస్సుల మీఁదుగా నున్న పెరియనంబిగారు మొదలైన యాచార్యులు కిరీటమును గూరేశాదులు పాదుకలును శ్రియఃపతి యాశ్రితులైన సర్వజనులకు నిష్టమైన ఫలమును నిచ్చి పాలించెడి యతిరాజను చక్రవర్తి కృపయాశ్మ సంపదలకు మొదలని లక్ష్మణాచార్యులానతిచ్చిరి॥ (ఎంబెరుమానారును జక్రవర్తినిగా నానతిచ్చి సూర్యసామ్యునిగా మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ సారసంగ్రహదీప సహితభాష్యముఖ ప్రబంధగోసాహ స్రభా సమూహ | దుర్నిరీక్ష్యాశేష దుర్వాదితామిశ్ర నాశనసజ్జన నళినబోధ | హేతుస్వమండలాహీన పర్యంకకధ్యేయ నారాయణ దివ్యమహిమ | విధ్వంసితాశేష విద్వేష్య బంధన భాష్యకారసమాఖ్య భానువంశ | జాతవైష్ణవ భూపాలజాలగుప్త | దర్శనాయోగ్య సాధింపఁదరము గాదు | వేదబాహ్యకుదృష్టిమర్త్యసంతతికి | నంచు లక్ష్మణమునివరుం డానతిచ్చె॥ ౭

తా॥ వేదాంతసార వేదాంతదీపములు మొదలైన శ్రీభాష్యాది ప్రబంధములనెడి సహస్రకిరణముల సమూహముగలిగియు విరోధులై దుర్వాదులైన యితర మతములనెడి చీఁకటి నాశనమాయెననియు సాత్వికులైన వారి ముఖములనెడు పద్మములు వికసించెననియు సూర్యుని మండలమునందు శేషపర్యంకుఁడై నారాయణుండు దివ్యమహిమతో వేంచేసియుండుననియు సకలమైనవారికిని సూర్యుఁడై యెంబెరుమానారుదయమైరనియు తేను సంబంధ సంబంధులైనయెడి సూర్యవంశమందుఁ బుట్టిన శ్రీవైష్ణవరాజులచేత నీదర్శనమనెడు నయోధ్యఁబాలించి యేలుటగాని యితరమైన వేదబాహ్యులకుఁ గుదృష్టిమర్త్యమతులైన యితరయోధులకు నాయయోధ్య సాధింపఁదరముగాదని లక్ష్మణాచార్యులానతిచ్చిరి॥ (ఎంబెరుమానారును సూర్యమండల సామ్యునిగా నానతిచ్చి క్షీరాబ్ధి సామ్యునిగా మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ పరిశుద్ధతత్త్వార్థ బహుపయఃపరిపూర్ణ సురభి విశేషార్థసార్థమాల
ల । నరసుతశతవైరి నాథయామునపూర్ణ కౌస్తుభాదిమణి ప్రకాశసుభగ ।
పూర్వపక్షార్థోక్తి భూరిసత్వసమృద్ధ చతురమర్త్యోద్భవ స్థానవిపుల । కల్యా
ణగుణగణాక్రాంత యతీంద్రాఖ్య నారాయణాలయ సత్ర విబుధ । యుక్తగు
రుపఙ్క్తినామపయోధిమధ్య । మహిత యతిరాజుఁ జేరెడు మానవులకుఁ । ద
త్కృపాపాత్రదేశికాప్తానువృత్తి । సాధనంబనె లక్ష్మణాచార్యవర్యుఁడు॥ ౮
తా॥ పరిశుద్ధములైన తత్త్వార్థములనియెడి బహుళమైన పాలుపరిపూ
ర్ణముగా నిండి యున్నదనియు నందులోపలి విశేషార్థములనియెడు తెరలుగ
లవనియు నమ్మాళ్వారులును శ్రీమన్నాథమునులును శ్రీయామునాచార్య
లును ననెడు కౌస్తుభము మొదలైన దివ్యరత్నములు పుట్టెననియు మంత్రార్థ
మనెడి చంద్రుఁడును అమృతమును బుట్టెననియు సర్వమైన యాత్మలును న
నెడి ముక్తములు గలిగినవనియు కల్యాణగుణములు నిండుకొనిన రామానుజు
లను పేరుగల నారాయణుండనియును శ్రీవైకుంఠమైన గురుపరంపరయనెడి
సముద్రమధ్యమున నుండుననియు నిట్టి మహాత్మ్యములు గల యెంబెరుమానా
రును జేరెడు మనుష్యులకు వారి కృపకుఁ బాత్రుఁడైౖ యాచార్యునికి నిష్టమైన
శేషత్వ పారతంత్ర్యాదులే యీయాత్మకు సాధనంబని లక్ష్మణార్యులానతి
చ్చిరి॥ (ఎంబెరుమానారు వైభవము క్షీరాబ్ధిసామ్యంబుగా నానతిచ్చి శ్రీరా
మావతార సామ్యంబుగా మీఁద నానతిచ్చుచున్నారు॥
సీ॥ హరిదాస్య యజ్ఞవిఘ్నాపాద్య విద్యాకృతాటకోత్పాటన దాశరథి
కిఁ । కామాదిదుర్జయ ఖరదూషణాది నిర్యాపణ రామచంద్ర పత్న్యయున
కు । నాశ్రితజ్ఞాన రాజ్యాపహృద్దుర్మాన వాలి నాశనరఘువంశజునకు । నా
త్మాఖ్య సీతాపహార కృద్దుర్మోహ రావణసంహార రాఘవునకు । నఖిలశరణా
గత విభీషణాభయప్రద । ధ్యానకాకుస్థునకుసిద్ధవాగ్మికునకు । భాష్యకారునకె
ప్పుడు పరవశుండు । దేవుడని చెప్పె లక్ష్మణదేశికుఁడు॥ ౯
తా॥ శ్రియఃపతి దాస్యమనెడి యజ్ఞవిఘ్న మాచరించెడి విద్యయను తా
టకను నా తాటకసుతులను సంహరించిన శ్రీరామచంద్రుఁడనియు కామా
దిదోషములనెడి ఖరదూషణాదుల సంహరించిన రఘునాయకులనియు తమ్ము
నాశ్రయించిన వారిజ్ఞానమనెడి రాజ్యమును నపహరించిన యధర్మపరుం
డైన వాలిని సంహరించిన రాఘవుండనియు ఆత్మయనెడి సీతాదేవిని దు
ర్మోహముచేతఁ గొంపోయిన రావణుని సంహరించిన రామభద్రుండనియు

సమస్తాత్మలను విభీషణాదులకు నభయమిచ్చిన దాశరథియనియు కాకుస్థవంశమున నవతరించిన ధార్మికుండైన శ్రీరఘునాయకుండు శ్రీభాష్యకారుల కెప్పుడును బరవశుండనియు ఆ యెంబెరుమానారు దేవుండని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఎంబెరుమానార్ల వైభవము రఘునాయకునిగా వర్ణించి యానతిచ్చి కాకుస్థవంశమున నవతరించిన రాజులు దిగ్విజయంబు చేసిన ట్లెంబెరుమానారు భూమిని సంచరించి వాదులను గెల్చి సాధువుల రక్షించె నని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ షట్సహస్రసవ్యయ స్వానుగై కాంతులు స్థిరచతుస్సప్తతి దేశికులను । సప్తశతోత్తమ సన్యాసి బృందంబు వలయు తానంత సద్వైష్ణవులును। వినుతింపఁ దాము దిగ్విజయంబుఁ జేయుచోఁ బాదసంగతి భూమిపావనముగ । సంచరించుచుఁ దత్త్వసందేహ మడిగిన ప్రామాణికుల నెల్ల బదిలపఱచి। వాదులను దర్కశరముల వైష్ణవత్వ। మునకు సమ్మతిఁ బుట్టించుముని వరేణ్యు। శేషసేనేశు లక్ష్మణుఁ జేరి బ్రతుకుఁ। డనుచు లక్ష్మణముని వరుం డానతిచ్చు॥ ౧౦

తా॥ పంద్రెండువేల యేకాంగులును డెబ్బది నాలుగు సింహాసనస్థులును నేనూఱుల జీయాళులును లెక్కలేని శ్రీవైష్ణవులఁగూడి తాము దిగ్విజయంబుఁ జేసిరనియు తమ శ్రీపాదస్పర్శలచేత భూమిఁ బావనముఁ జేసి రక్షించిరనియు తత్త్వసందేహ మడిగిన ప్రమాణికులకుఁ దత్త్వసందేహములు దీర్చిరనియు వాదులనైతే శత్రువులను దర్కమనెడి శరములఁ ద్రుంచిరనియు శ్రీవైష్ణవత్వమునకు సమ్మతిఁ బుట్టించిన మునిశ్రేష్ఠుండైన యెంబెరుమానారనియు తిరువనంతాళ్వారును సేన మొదలియాళ్వారును నితండె చేరి బ్రతుకుండని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఎంబెరుమానారు శిష్యులును దామును భూమిఁ దిరిగి తత్త్వవేత్తలైన పెద్దలకుఁ దత్త్వార్థములు ప్రసాదించిరని యానతిచ్చి యెంబెరుమానారును నిక్షేపసామ్యునిగా నానతిచ్చుచున్నారు॥)

సీ॥ శఠకోపముఖ గురుజనభక్తి సిద్ధాంజనోన్మీలితాలోక నోప । యోరి । సుసంస్కృత ద్రావిడ శబ్దరూపోభయ వేదాంతచక్షు రుద్వీక్షణ । మున । గూఢామృతస్వర్ణ కుంభసంపూర్ణ సద్గుణరత్న నిక్షేపగుప్తిఁ । జూచి । యంతయుఁ బోనీక హర్మ్యంబుతో నెత్తి నిజమనోమయకోశ నిలయ । మందు ।। దాఁచె యతిరాజు తా మహా దారుఁడగుట । సర్థులకు నీయఁ దామును ననుభవింప । సతనిమంత్రులఁగని కొల్వ నతఁడె ధన్యుఁ । డనుచు లక్ష్మణముని వరుండానతిచ్చు॥

తా॥ నమ్మాళ్వారులు మొదలైన గురువుల యందు భక్తి ఘనిమెడు సిద్ధాంజనముచేతఁ జూడఁబడిన మహాయోగియనియు సంస్కృత ద్రావిడ రూపమైన యుభయ వేదాంతములనెడి తిరునయనములచేత శ్రియఃపతి యనెడు సువర్ణభాండములో గురువుల రహస్యములనెడి దివ్య రత్నములు నించి యెవ్వరికిని గానరాకుండ నిక్షేపించిన నిక్షేపముం జూచి గనియు సంతోషముతో నంతయును నెత్తి తమ మనస్సనెడి శ్రీ కోశమందుంచిరనియు నెంబెరుమానారు తా మహోపకారుండు గనుక దాఁచినది యడిగిన వారికి నిచ్చుటకును దా ననుభవించుటకును గర్తలై యుండిరనియు నతని మంత్రులైన శిష్యులనుగని కొలిచిన యతండె ధన్యుండనుచు లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఎంబెరుమానారనివాఁడు నజనకాఁడు రహస్యములనియెడి నిక్షేపమెత్తి తామనుభవించుచును నడిగిన వారికిఁ బ్రసాదించుననియానతిచ్చియు త్తారకత్వము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ శ్రీశభక్తి శరారి సేవాభిరతిఁ జూచి ధార్మికత్వము జూచి దయయుఁ జూచి। సర్వతత్త్వజ్ఞాన సాధనశాస్త్ర ప్రవర్తకత్వముఁ జూచి వాసిఁ జూచి। యాత్మహితోపదేశాది లబ్ధాఖిల దేశికత్వముఁ జూచి తృప్తిఁ జూచి। యుత్తారకత్వోప యుక్తగుణములఁ జూచి వరవరద త్తసంపదలఁ జూచి। సకలదేశిక వరుల నిశ్చయముఁ జూచి। తమకు నెంబెరుమానారె దైవమనుచు। నాశ్రయించియుఁ దమవారి కందఱికిని। నతఁడు గతియను మాలక్ష్మణార్యులెపుడు॥ ౧౩

తా॥ శ్రియఃపతి యందు భక్తి గలిగిన నమ్మాళ్వారుల సేవయందు భక్తాతిశయములు చూచియు ధార్మికత్వమైన దయను జూచియు సకల తత్త్వజ్ఞాన సాధనములైన శాస్త్ర ప్రవర్తకముఁ జూచియుఁ బూర్వుల కన్న నితని వాసిఁ జూచియు సకలాచార్యులలోపల నాత్మకు హితమైన రహస్యము ప్రసాదించెడు నాచార్యత్వముఁ జూచియు నందువలన సకలాత్మల తృప్తిఁ జూచియు నుత్తారకత్వానుగుణమైన గుణములఁ జూచియు పరులదోషములుచూడక తాము కృపచేత నిత్య సంపదలుగల రహస్యములు బయలుచేసిరనియుఁ బూర్వులందఱును బోయిన పోకఁ జూచియుఁ దమకు నెంబెరుమానారే దైవమనుచుఁ దా మాశ్రయించి తమవారి కందఱికిని నతండె గతియని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఎంబెరుమానారును త్తారకత్వము నానతిచ్చి ప్రథమ మధ్యమ చరమ పర్వనిష్ఠుల స్వరూపము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ప్రథమ పర్వము శుభ ప్రద గురు ప్రీతిగా భగవదం ఘ్రిద్వ
య ప్రవణుఁ డగుట । మధ్యమ పర్వంబు మాధవ ప్రీతిగాఁ దద్దాస జనదా
స్య ధర్మియగుటఁ । జరమపర్వము విష్ణుసంశ్రిత ప్రీతిగా నిజగురు గాస్త్రైక
నిరతుఁడగుట । దేవదేవతదీయ శేషిక త్వాకృతి పూర్తికి భాష్య కృత్స్వామి
యగుటఁ । బూర్వులందఱు యతిరాజ పూర్ణ కృపకుఁ । బాత్రు లగుచుండితత
ద్దాసభావవిదిత । వైభవాచార్య నిష్ఠులై వసుధలోన । నుందురని చెప్పె
లక్ష్మణ యోగివరుఁడు॥ ౧౩

తా॥ ప్రథమపర్వ మాచార్య ప్రీతిగా శ్రియఃపతి చరణముల యందుఁ
బ్రావణ్యము గలిగియుండుటయనియు మధ్యమ పర్వము శ్రియఃపతికిఁ బ్రీతి
గా శ్రీవైష్ణవులకు దాస్యము చేయుటయనియుఁ జరమపర్వము శ్రీవైష్ణవ ప్రీతి
గా నాచార్యుని దాస్యమునకు నొడఁబడి చేయుటయనియు శ్రియఃపతియు
శ్రీవైష్ణవులును నాచార్యుండును వీరి పూర్తులకెల్లను నెంబెరుమానారే కర్త
యని పూర్వాచార్యు లందరును యతిరాజు సుపూర్ణ కృపకుఁ బాత్రులగు
చుండి వారి దాసులై వైభవముల ననుభవించి యాచార్యాభిమాన నిష్ఠులై
యీభూమిలో నుందురని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ ( ఈతీరునఁ బ్రథమ
మధ్యమ చరమ నిష్ఠల తారతమ్యముల నానతిచ్చి పూర్వు లెంబెరుమానారు
నాశ్రయించి కడ తేరిరనమీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ ఎఱుఁగని యర్థంబు లెఱిఁగించు టకుఁ దానె సర్వ జగత్సదా
చార్యుఁడయ్యె । భగవత్పరాచార్య పరతంత్రతకుఁ దానె కరుణఁ దదియా
గ్రగణ్యుఁడయ్యె । శాస్త్రోక్తలక్షణ సామ్యార్థములఁ దానె సద్వినిశ్చిత శేష
శాయియయ్యె । నాచార్యతను దదీయాకారతను విష్ణు భావంబు ననులోక
భర్తయయ్యె । ననుచుఁ బూర్వులు యతిరాజునాశ్రయించి । తమ్మునన్నినవా
రికాతని నెచూపి । తమకుఁజూపిన యాచార్యుఁ దగిలిచూతు । రనుచులక్ష్మణ
మునివరుం డానతిచ్చు॥ ౧౪

తా॥ ఎఱుఁగనియర్థముల నెఱిఁగించి నందువలన సర్వజగత్తులకు నాచా
ర్యుండాయెననియు శ్రియఃపతియందు నాచార్య పరతంత్రతచేతను శ్రీవై
ష్ణవులలో మున్నన్నఁ దగిన వారనియు శాస్త్రోక్తలక్షణముల సామ్యార్థ
ములను నిశ్చయించి శేషశాయియైన శ్రియఃపతి యితండె యనియు నాచా
ర్యత్వమందును శ్రీ వైష్ణవత్వమందును శ్రియఃపతిత్వ మందును నీమూఁటి
కిని నేలికయాయెననుచుఁ బూర్వు లెంబెరుమానారు నాశ్రయిఁచిరనియు

పెద్దస్వామియైన యెంబెరుమానారు జీయరు తమ్ముసమ్మినవారికి సతనినే చూపిరనియు తమకుఁ జూపిన యాచార్యుని మఱువకుండఁ దగిలి యుందురని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ (ఎంబెరుమానారు వైభవమానతిచ్చి శ్రియఃపతికిని నమ్మాళ్వారికిని, నెంబెరుమానారుకును వీరికే నయిక్యత మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ శ్రీశ పరాంకుశ శ్రీ భాష్యకారులు నాత్మయు దేహంబు నంఘ్రులుగను। భావించి వస్తుప్రభావంబు గనివారి నైక్యతయును జూపి యందులోన। నాశ్రయించినఁ గార్యమగుటకు సందేహమించుక లేకుండ నెఱిఁగి పూర్వు। లంఘ్రియుగ్మ స్థానమందున్న యతిరాజె రక్షకుండాతండె మోక్షమునకుఁ। గర్తయని పట్టుచోటను ఘటికులైన। కూరకురుకేశ్వరాది సద్గురువరులను। సరవి సేవించి తత్పరస్సరము గాను। బట్టుదురు లక్ష్మణార్యులు పట్టిట్లు॥ ౧౫

తా॥ శ్రియఃపతిని నాత్మస్వరూపముగా నమ్మాళ్వారు తిరుమేనునుగా నెంబెరుమానారు చరణములుగా నీమూఁటినైక్యతఁ జూచి భావించి వస్తుప్రభావంబుఁ గనుఁగొనవలెననియు నందులోన నాశ్రయించినఁ గార్యమగుటకు సందేహమించుక లేకుండఁ బూర్వులెఱిఁగి కదా పాదద్వయస్థానమందున్న యతిపతి రక్షకుండాతఁడె యనియు మోక్షమునకుఁ గర్తయతండని పట్టుచోట ఘటికులైన కూరత్తాళ్వారులు తిరుకురుకైప్పిరాన్ పిళ్లాను మొదలైన గురువులను నామార్గమందే సేవించి లక్ష్మణార్యులు పట్టిన ట్లిమఱియుఁ బట్టుదురనిలక్ష్మణార్యులానతిచ్చిరి॥ (యెంబెరుమానారు సకలాత్మలకుఁ గర్తయని యానతిచ్చి పూర్వులతని వైభవము బలుకు పెట్టినది మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ స్వప్రబంధంబందు శఠవైరి యెవ్వరి యవతారమునఁ గలిపొడఁగునని యె। నెవ్వరి వైభవం బెఱిఁగించె నీశ్వరుఁ డర్చావతారమై యున్నచోట్ల। నాథయామున పెరియనంబి ప్రభృతులైన దేశికులెవ్వరిదీప్తిగనిరి। భారతియును మూఁగ బ్రహ్మరాక్షసుఁడును నెవ్వరిసద్భావ మెఱుఁగఁజెప్పె। రట్టి యతిరాజు పూర్వాధారనవతరించి। మనలరక్షించ వేంచేసె మనుజులార। చేరి బ్రతుకుఁడు మీరని చెప్పుచుందు। రాప్తులైనట్టి మా లక్ష్మణార్యులెపుడు॥ ౧౬

తా॥ నమ్మాళ్వారు తామానతిచ్చిన దివ్యప్రబంధమైన తిరువాయిమొళియందు నెవ్వరి యవతారమునఁ గలియుగ దోషమడఁగునని యానతి

చ్చిరనియు శ్రియఃపతి యర్చావతారమై యన్నిచోట్ల నెవ్వరి వైభవ మెఱిం గించి రనియు శ్రీమన్నాథమునులు శ్రీయాళ వందారులు పెరియ నంబి మొదలైన యాచార్యు లెవ్వరి దీప్తిఁగనిరనియు సరస్వతియు మూఁగయు బ్రహ్మరాక్షసుండును నెవ్వరి యభీష్టమును బడులు పలిచిరనియు నట్టి యెంబెరుమానారు శ్రీపెరుంబూదూర నవతరించి రనియు మనలరక్షించ వేంచేసిన దైవము మనుష్యులారా మీరు చేరి బ్రతుకుఁడని యాప్తులైన మా లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఎంబెరుమానారు వైభవము వారు వాలెఱిఁగి బయలుచేసిరని యానతిచ్చి మరియు నెంబెరుమానారు వైభవము శ్రియఃపతిగా నాద్యాంతమును మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ జ్ఞాని తత్త్వజ్ఞాన సమ్యగనుష్ఠాన పరిపూర్ణుఁడును బంధ బంధహరుఁడు। అజ్ఞానులకునెల్ల నగ్రగణ్యుఁడు గాన యతిరాజుదాహరి కంత రాత్మ। హరికంత రాత్మైన యామునీశ్వరునకు శఠవైరిముఖులు మస్తకము గాత। గూరేశ్వరాది సద్గురులంఘ్రులుగదన్యుఁ దలఁచియు జీవింపఁ దది తనులకుఁ। జెప్ప నేటికి యతిరాజుఁ జేరకున్న। లేదు ఉజ్జీవనము బ్రహ్మలిఖి తమనుచు। నెఱిఁగియతిరాజుదాసుల నిందునందుఁ। గూడుఁడనిచెప్పె లక్ష్మణ గురువరుండు॥ ౧౭

తా॥ స్వస్వరూప జ్ఞానముగలవాఁడు తత్త్వజ్ఞానము నెఱింగియుండవలెన నియు ఆ తత్త్వజ్ఞాన మనుష్ఠాన పూర్వకముగాఁ గలిగి సంసారానుబద్ధులై సంసారబంధములు విడుచుకొన్న మహాత్ములైన జ్ఞానాధికులనెల్ల నగ్రగణ్యులెంబెరుమానా రనియు అట్టి మహాత్ముఁడు శ్రియఃపతికి నంత రాత్మయై యుండుననియు శ్రియఃపతికి నంత రాత్మయైన యెంబెరుమానారుకు నమ్మాళ్వారులు మొదలైన గురువులు శిరస్సుగాఁ గూరత్తాళ్వారులు మొదలైన యాచార్యులు చరణములుగా నీ తీరునఁ దాము తలంచి యనుభవించఁగాఁ గడమవారికిఁ జెప్ప నేటికనియు నెంబెరుమానారును జేరకున్న నెవ్వరికిఁ బ్రాప్యములేదు ఇది బ్రహ్మ లిఖిత మని యెంబెరుమానారు దాసుల నిచ్చటనచ్చటఁ గూడుండనుచు లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఎంబెరుమానారు శిరస్సంబంధమును దిరువడిఘళ సంబంధమును నానతిచ్చి యెంబెరుమానారుకు ముగ్గురు తిరుమేనైయుండిరని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఈశ్వరుం డాత్మగా సీతని తిరుమేను శఠవైరిగా వీరి చరణ యుగమ్ము। యతిరాజుగాఁ జూచి నైక్యంబు భావించి త్రివిధంబు దృఢమని

తెలిసిపట్టి । వరవరముని యతీశ్వర కృపాపాత్రులైరై శ్రద్ధానచరమ సంస్థా నియగుట । యెఱింగిన వారికి నెవ్వరుద్దేశ్యులు ప్రాప్యులు సులభులు ప్రాపకులును । నుడువ రెకాక మఱియును వొకరుగలరె । పక్షపాతంబు లేక సద్భావమెఱింగి । బ్రతుకవలెనని జనులకుఁ బరమహితము । తెలిపి చెప్పను లక్ష్మణ దేశికుండు॥ ౧౮

తా॥ యెంబెరుమానారు శ్రియఃపతికి నాత్మగాను నమ్మాళ్వారులు తిరుమేనుగాను నెంబెరుమానారు తిరువడిగళు గాను నైక్యముఁ జేసుకొని యీ మూఁడు విధములు దృఢముని తెలిసి పెరియజీయ రెంబెరుమానారు లధికులనుచు వారి కృపకుఁ బాత్రులైరై హరి దాస్యమునకు ననుకూలముగాను బరమార్థి కారులై యుండిరనియు నీ విధమెఱింగిన వారికి నెవ్వరుద్దేశ్యులును బ్రాప్యులును సులభులును బ్రాపకులును నెంబెరుమానారే కాని మఱి యొకరు లేరనియు పక్షపాతంబు లేక యభీష్టమెఱింగి బ్రతుకవలెనని జనులకుఁ బరమహితము తెలిపిరని లక్ష్మణార్య్య లానతిచ్చిరి॥ ( ఈముగ్గురియందును నెంబెరుమానారు సంపూర్ణముగా నుండిరని యానతిచ్చి మఱియు వారిమహిమలు మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ శ్రీమ దచ్యుత పాద సేవాభిరతిని దత్పరపరాంకుశ పాద భక్తులైరి । యఖిల వేదాంత సూత్రార్థంబులరయఁగా ఘనతర శ్రీ భాష్య కారులైరి । యుభయవరనితన్ను నుభయ విభూతులు రంగియ్యఁగ యతిరాజులైరి । పరసమృద్ధికినన్య పర దుర్గతికిగాను దర్శనకర్తలు ధార్మికులును । నయిరి యెంబెరుమానారు లధికులనుచు నమ్మి రామానుజాహ్వయ నరులపాలి। పారిజాతంబు గురువరుభక్తితోడఁ । గొలువుఁడనిచెప్పె లక్ష్మణ గురువరుండు॥ ౧౯

తా॥ శ్రియఃపతి తిరువడిఘళయందు నత్యంత ప్రేమగల నమ్మాళ్వారుల తిరువడిఘళ యందు భక్తి గలవా రెవ్వరనియు సమస్తవేదాంత సూత్రములుదీసి యర్థములఁజేసి శ్రీభాష్యమానతిచ్చి నందువలన శ్రీ భాష్యకారులైరనియు నుభయ విభూతులు రెండను నంబెరుమాళ్ళు ప్రసాదించఁగా నుడయవరులైరనియు పరసమృద్ధికొఱకుఁ బరులనుగ్గతులఁ జూచి రక్షించెడు కర్తయనియు నిట్టి గుణములు గలిగి దర్శన కర్తలై ధార్మికులైన యెంబెరుమానారు మతము నమ్మి రామానుజులనెడి తిరునామము నరుల పాలిటి కల్ప వృక్షమైన యాచార్యునికి సేవ సేయుండని లక్ష్మణార్య్యలానతిచ్చిరి॥ ( ఎంబెరుమానారు

వైభవము కల్పవృక్షసామ్యముగా నానతిచ్చి నడాదూరి యమ్మాళువార్త మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఆర్తినడాదూరి యమ్మాళు పరుఁజేరఁ బయనమై పోవుచో భక్తులైన । శిష్యులునలుగురు శ్రీపాదములయొద్ద సేవించి హితమింకఁ జెప్పుమనినఁ । బరమపూరుష పాదభక్తి ప్రపత్తులు దుష్కరత్వము మీకుఁ దోచెనేని । రామానుజార్యులే రక్షకులనినమ్మి సేవించుడిది మెవిశేషమనుచుఁ । బరమమందానతిచ్చిన జనహితంబు। తానె దయచేసి యిది భూరిధానముగను । నతనితిరునామ సంకీర్తనాకృతిగను । దెలిపిచెప్పెను లక్ష్మణదేశికుండు॥ ౨౦

తా॥ నడాదూరి యమ్మాళు పరమపదమునకు వేంచేసెడు సమయమందు నలుగురు శిష్యులు శ్రీపాదముల యొద్దనుండి సేవించి యీ యాత్మకు నింక హితవానతిమ్మని విన్నపముఁ జేసుకొని రనియు శ్రియఃపతి చరణములయందు భక్తిప్రపత్తులని ప్రయాసములైయుండును మీరుకడ తేరవలసి యుండెనేని రామానుజార్యులే రక్షకులని నమ్మి సేవించుడీయిది శాస్త్రసిద్ధమనుచుఁ బరమకాలమందు నానతిచ్చిన జనహితంబు తామె కృపచేత నిదిభూరిదానముగ నాతని తిరునామ సంకీర్తనలుగా నానతిచ్చిరని లక్ష్మణాచార్యులానతిచ్చిరి॥ ( నడాదూరి యమ్మాళు తమ శిష్యులకు నెంబెరుమానారు తిరువడిఘళఁ జూపిరని యానతిచ్చి ముముక్షులక్షణము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ బహుదుఃఖ మూలమీ ప్రకృతి సంగతియని మొఱలెఱింగినఁ దా ముముక్షువగుట । కమలజాద్యైశ్వర్య కైవల్య వాంఛ నిర్మూలమై చెడిన ముముక్షువగుట । ప్రకృతి సంబంధంబుఁ బాసి నిరవధి నిత్య ముదమందఁ దలఁచ ముముక్షువగుట । పుణ్య పాప క్రియల్ పుట్టు హేతువులని మును మానినపుడు ముముక్షువగుట । యర్థ పంచకమున్నట్టి యరసితనకుఁ దగిన సాధన సాధ్య సంస్థాన మెఱిఁగి । యుచితహితకారి లక్ష్మణయోగి కృపను। మునివరేణ్యునిఁ జేర ముముక్షువగుట॥ ౨౧

తా॥ బహుదుఃఖములఁ గలుగఁజేసెడి ప్రకృతియొక్క సంగమనుని దెలిసిగి నపుడె ముముక్షుండనియు బ్రహ్మేంద్రాదుల యైశ్వర్యమును గైవల్యవాంఛను నిర్మూలముగాఁ జెడిన యపుడు ముముక్షుండౌట యనియు ప్రకృతిమైన దేహ సంబంధము నెడవాసిన యధికమైన సంతోషముఁ దలంచుచే ముముక్షువనియు పుణ్యపాప రూపములైన క్రియలు పుట్టుటకు హేతువులని యవి మానిన యపుడె ముముక్షువనియు నర్థపంచక మున్నట్టె యెఱిఁగిన

ముముక్షువనియు తనకుండఁదగిన సాధ్యసాధనముల నిలుకడ తెలిసిన ముముక్షుండౌట యనియు నాత్మలకు హితుఁడైన యుచితపరుండు గనుక యెంబెరుమానారు జీయరు కృపను నామహాత్మ్యము జేసినయపుడే మముక్షువని లక్ష్మణాచార్యు లానతిచ్చిరి॥ ( ముముక్షు లక్షణ మానతిచ్చి శరీరసంబంధులమీఁది భ్రమ మానవలెనని మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ కర్మ నిబంధనా గంతు కాన్వితు లను బంధువు లని తానె భ్రమసినట్టి । తల్లి తండ్రులభార్య తనయుల సహజుల సంబంధులను బాంధవ సఖుల గురులఁ । దనవని మదిలోనఁ దలచుఁ గృహక్షేత్ర పశుధన ధాన్యసంపదలవి డిచి । యవియెల్ల నారాయణా హ్వయుండేయని మనసులోఁ దలపోసిమఱి గిపట్టి । యఖిల వస్తువులందును సతిఁగనుచుఁ । నిర్భయంబునఁదిరుగాడ నేరకున్న । గురువరుండగు యతిరాజుఁ గొలిచినమ్మి । యుండ వలెననె లక్ష్మణ యోగివరుఁడు ౨౨

తా॥ కర్మానుకూలముగా వచ్చిన శరీర సంబంధువులను సంబంధువులని భ్రమసినట్టి తల్లి దండ్రులను భార్యా పుత్రులను సహోదరులను నిచ్చి పుచ్చుకొన్న సంబంధులను బాంధవులైన చెలికాండ్రను దమతమ పెద్దలను నివితనవని మదిలోనఁ దలంచు భ్రమలను గృహక్షేత్రములను బాడిపసులను దనకుఁగలిగిన ధనధాన్యములను నివిమొదలైన సంపదలను నివియన్నియు నారాయణుఁడే యని మనస్సునం దలపోసి మఱిగిపట్టి యుండవలె ననియు సకల వస్తువుల యందును శ్రియఃపతిని గనఁగొని నిర్భయంబునఁ దిరుగాడ నేరకున్నను నాచార్య శ్రేష్ఠులైన యెంబెరుమానారును గొలిచి నమ్మి యుండవలెనని లక్ష్మణాచార్యు లానతిచ్చిరి॥

గద్య॥ ఇది ముముక్షుజనకల్పకంబును మహా ప్రబంధంబునందు యతీంద్రవైభవప్రకాశ ప్రకరణంబులో శ్రీమంగళాశాసన ప్రయోజనైక భావవర్ణనంబును లక్ష్మణముని తద్దివ్యనామానుసంధానంబుఁజేసెడు ప్రకారంబునుదత్సమాశ్రిత శ్రీవైష్ణవసమృద్ధియు నర్చావతారాభ్యుదయ ప్రభృతులు తద్వైభవంబు బయలుచేసిన ప్రకారంబును భక్తిప్రపత్తిః ష్ఠాధికారి జనస్తుతి విషయగుణాకరత్వంబును జతురంగ బలసమేత సార్వభౌమ సామ్యంబును సూర్యసామ్యంబును క్షీరాబ్ధి మధ్యస్థిత నారాయణ సామ్యంబును రాఘవ సామ్యంబును దిగ్విజయ ప్రకారంబును నిక్షేపోద్ధరణ ప్రకారంబును దదుపాస్యత్వహేతు ప్రకారంబును బర్వత్రయ నిష్ఠోపాస్యత్వ ప్రకారంబును భగవద్భాగ

వతాచార్యత్వ పూర్తియుఁ దదుపాస్యత్వంబు పూర్వులను సంధించెడి ప్రకారంబును జ్ఞానినామగ్రే సరత్వంబును నేతద్విషయ వరవరముని నిష్ఠా ప్రకారంబును దద్దివ్యనామ హేతుప్రకారంబును భక్తిప్రపత్త్య శక్తజన సేవ్యత్వంబును ముముక్షుజనలక్షణంబును సర్వ సులభోపాయత్వ వర్ణనంబును నన్నది పంచమ ప్రకరణము॥

అచ్యుత శఠకోప యతిరాజ వరవర నిజగురుభ్యోనమః.



శ్రీమతేరామానుజాయనమః.

ము ము క్షు జ న క ల్ప క ము.

షష్ఠమ ప్రకరణము.

శరీర సంబంధులు మొదలైన పదార్థములయందు భ్రమ మానవ లెనని యానతిచ్చి శరీరమందు నీయాత్మ యుండి విడిచి పోవువిధము మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ ॥ వాగింద్రియాదులు వచ్చి మనసునఁ గూడ మనసును బ్రాణ సంబంధినైనఁ । బ్రాణంబు వ్యాపక భావంబు చాలించి భూతసూక్ష్మ విశిష్ట పురుషుఁ జేరఁ । బురుషుండు నట్లతద్భూత సూక్ష్మేంద్రియ ప్రాణాదితో పరమాత్మఁ జేర । భోగమోక్ష నిదాన పుణ్యపాప క్రియా వాసనన్యాసానుబంధ విహిత । హార్ద్రిదర్శిత నాడీ ప్రయాణగతిని । నియత మార్గానుసారినై నిరయనాక । నిత్య వైకుంఠ భోగాది నియతి దేహుఁ । డగుచుభోగించునని లక్ష్మణార్యులనిరి॥ ౧

తా॥ కర్మేంద్రియములైదునుమనస్సునఁగూడి యామనస్సుకర్మేంద్రియములజ్ఞానేంద్రియములఁ గూర్చుకొని ప్రాణముతో సంబంధించుననియు ఆ ప్రాణము శరీరమందు వ్యాపించిన గార్యముచాలించి యిన్నిటిని గూర్చుకొని సూక్ష్మమైన పురుషునిం జేరుననియు ఆ పురుషుండైన యాత్మ యింద్రియములను బ్రాణాదులను గూర్చుకొని పరమాత్మఁ జేరుననియు భోగించుటకు మోక్షమును స్వర్గ నరకములును గట్టికిచేసియు సర్వాపరాధములకును ద్వయము విహితమైయున్నది గనుక పరమాత్మనైన శ్రియఃపతి కృపాదృష్టిచేత నీచేతనుండే

త్రోవంబోవక నీతిపరుండై నరకమందును స్వర్గమందును వైకుంఠ మందును నిందుకుఁ దగిన దేహములెత్తి యాయాగతుల భోగించునని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శరీరము విడిచిన ప్రకారమును నాయాగతులకుఁబోయెడు మార్గమును నానతిచ్చి శరీర మెత్తు విధము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ భుక్తావశిష్ట తత్పుణ్య పాపక్రియా యుక్తుఁడై గగన సంయుక్తుఁడగుచు। నాదిత్యకిరణ సంఘాకృష్టహిమజాల యుక్తుఁడై మేఘసంయుక్తుఁడగుచు। వర్షాంబుపాత సంవర్ధిత సస్యాది యుక్తుఁడై ధాన్య సంయుక్తుఁడగుచు। నన్నాది భోగ్య పదార్థాసి పురుష సంయుక్తుఁడై శుక్ల సంయుక్తుఁడగుచు। యోనిలోఁ జొచ్చి గర్భంబులోన దేహి। వెనుకనౌనని పంచాగ్నివిద్యఁ జెప్పె। జీవుఁ డీలోకమునఁ బుట్టజేయు నపుడు। ననుచు లక్ష్మణ మునివరుం డానతిచ్చు॥ ౨

తా॥ స్వర్గ నరకాదుల ననుభవించి కించిత్కర్మ శేషముతోడ నీయాత్మగూడి నిలిచెననియు ఆయాకాశ మందుండిన సూర్య కిరణములఁగూడి శుంచున సంబంధించి మేఘముతోఁ గూడెననియు వర్షముతోఁగూడి సస్యములయందుఁ బ్రవేశించి వృద్ధిఁబొంది ధాన్యాదులయందు గూడియుండుననియు అన్నము మొదలైన పదార్థములఁగూడి పురుషునియందుఁ బ్రవేశించి శుక్లమందుఁ గూడుననియు ఆ శుక్లము యోనిలోఁ జొచ్చి గర్భంబులో దేహము వృద్ధిఁబొంది జన్మించునని పంచాగ్ని శాస్త్రముఁ జెప్పెననియు జీవు డీలోకమునఁ బుట్టవచ్చునప్పుడని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ ( ఇటువలెనాత్మజన్మించువిధమానతిచ్చి యీ దేహము చెరసాలగా మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ దేహంబు చెరసాల దేహ సంబంధులు తనచేతి సంకెలఁ దగులువారు। కాలిసంకెలలహంకార మమతలు రెండు వలయంబు లజ్ఞత వాటిచీల। బ్రతుకఁ జూచెడునాశ బంధమెత్తుగఁగట్టి చేపట్టినడిపించు చివికితాడు। పంచేంద్రియంబులు బాధకుల్ వారికిఁ బరిదానమీభోగ్య పంచకంబు। తన్నునొప్పించుమనసు సైఁ దరువుకాఁడు। ఆత్మచెరనుంచి బాధల నలయువాఁడు। తప్పులోఁ గాని యతిరాజు తన్నుఁ గాచు। దేవుఁడని చెప్పె లక్ష్మణ దేశికుండు॥ ౩

తా॥ దేహమే చెరసాల యనియు దేహసంబంధులు తనచేతి సంకెళ్లఁ దగులు వారనియు కాలిసంకెళ్ల హంకార మమకారములు రెండును వలయములనియు అజ్ఞానము వాటి చీలయనియు తాను బ్రతుకఁ జూచెడు నా

శ యాసంకెళ్లకు నెత్తుగాఁ గట్టిన చిచికి తాడనియు పంచేంద్రియములు బాధలపెట్టెడి కావలి కాండ్రనియు పంచేంద్రియంబుల వ్యాపారములు వారికిఁ బరిధానమనియు నీతీరునఁ జెరనుండిన యాత్మకు మనస్సుపైఁ దరువు కాఁడనియు నీబాధలచేతఁ బడఁగా దిక్కు-వీనికి లేదని యెంబెరు మానారువేఁచేసి యీతప్పులలోఁగాని చెరవిడిపించిన దైవమని లక్ష్మణార్యలానతిచ్చిరి॥ (చెరనుండిన యాత్మను నెంబెరుమానారు విడిపించి రక్షించిరని యానతిచ్చి సంసారము మహా సముద్రముగా మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ సంసార మతిఘోర సాగర మాశలు పెనునీరు రాగముల్ పెద్దసుళ్లు । మరియు కామాద్య హమ్మమతలు గ్రాహంబులుక్త తాపత్రయపు మూర్మిమాల । చిత్త వికారంబు శీఘ్రవాయుక్షోభ మొలికెడు దేహమం దోటివాఁడ । పోషక ధారక భోగ్యంబు లందులో గురుతుగాఁ గొని వేసుకొన్నసరుకు । నోడ నెక్కిన బేహారిజాడ నాత్మ । మునుఁగక దరిఁజేరఁదా మ్రొక్కుకొన్న । దైవమాచార్యుండై వచ్చి తన్నుఁ గాచు । ననుచు లక్ష్మణ మునివరుం డానతిచ్చు॥ ౪

తా॥ సంసారమనియెడి మహా సముద్రమునకు నాశలే నీళ్లనియు సంతోషములే పెద్దసుళ్లనియు కామక్రోధ లోభ మోహ మదమత్సరంబులు మకరకచ్ఛపాది జంతువులనియు తాపత్రయములనియెడి తెఱలు గల వనియు చంచల మనస్సనియెడు సముద్రమందుఁ దీవ్రగాలి కలదనియు దేహ మనియెడు నోటివాఁడ యా సముద్రమునందు నడచుచున్నదనియు ధారక పోషక భోగ్యంబులు తనకుఁ గావలసి కొనివేసుకొన్న సరుకులనియు నోడ నెక్కిన వర్తకునివలె నీచేతనుండు తనకు దైవమైన దేవతను గూర్చి నీయోడ సముద్రములోపల మునుఁగక యావలి దరిఁజేరెనేని యింత మాత్రము నీకుఁ గానుక యిచ్చెదనని మ్రొక్కుకొన్నట్లు యీయోడ గడతేరెనన్నట్లు చేతనుని సంసార సముద్రమునుండి కడతేర్చుటకుఁ దన దోషములు కానుకగాఁ గైకొన్న దైవమాచార్యుఁడై వచ్చి తన్నుఁ గాచునని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( సంసారము సముద్రముగా నానతిచ్చి యీసంసారమే యడవిలోపలి పొదయని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ అతిఘోర సంసార మడవిలోపలి పొద దుష్ట దేహంబందు దొడ్డపుట్ట । విషయ పంచకమందు విషయుక్త సర్పంబు బుద్ధీంద్రియంబులు పుట్టమూళ్లు । శబ్దాదిభోగ్యతా సర్పంబునకు విష మాహేయ విషయ భోగాశ

కాటు । అనుభవించుట విషంబంతట యెక్కుట మోహంబు తా మూర్ఛమ
నిఁగిపడుట । విషయ ఫణిదష్టుఁడైయున్న వీఁడు బ్రతుక । ననువు చింతించు
వాఁడు సంయమన రేంద్రుఁ । డొకఁడె మాంత్రికుఁడని చూచి యుడయవరు నె
చెప్పె లక్ష్మణముని తమ శిష్యులకును॥

తా॥ అతిఘోరమయిన సంసార మడవిలోపలి పొద యనియు ఆ పొద
లోన దేహమనెడి దొడ్డ పుట్ట యున్నదనియు, పంచేంద్రియములనెడి విషమ
తోఁగూడిన పాము ఆ పుట్టలో నున్న దనియు అంతఃకరణలైన మనోబుద్ధి
చిత్తాహంకారములు పుట్టకూళ్లనియు నీ పంచేంద్రియముల వలని విషయము
లనెడి భోగమా సర్పము కాటనియు అనుభవమనెడి విషము శరీర మంతను
కెక్కెననియు మోహమనెడి మూర్ఛచేత విషమెక్కి శరీరము మఱచె ననియు
నీ పాము చేతఁ గాటుఁబడి యున్న వీఁడు బ్రతుకు ననువు చింతించిన
వాఁ డెంబెరుమానా రొకరుండె మాంత్రికుండైన విష వైద్యుఁడనియు న
డయవరులే తమ శిష్యులకు దిక్కని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( సంసారమ
నెడి సర్పముచేత దష్టుఁడై యున్న చేతనుని నెంబెరుమానారు మాంత్రి
కుండై బ్రతికించెనని యానతిచ్చి స్త్రీలభోగము ప్రత్యక్ష నరకమని మీఁద
నానతిచ్చుచున్నారు॥)

సీ॥ సంతత జ్ఞాన ప్రసరణ కారణ బుద్ధి కన్నులు జ్ఞానంబు కనెడి
దృష్టి । కామంబు కన్నుల కాంచాది దోషంబు నిబిడ దృష్టియుఁ గామినీ మ
యంబు । పురుషార్థమా యువతి భోగంబు దానికి ఘనసాధనమ కృత్య కర్మ
కరణ । మందుండుఁగానఁ దానజ్ఞాన సరణిని నడఁచి చేరెడి చోటు నరకమను
చు । సుగుచిరజ్ఞాన దర్శన సుభగుఁడైన । భాష్యకారుల వెనువెంటఁ బాయక
న్న । వారి వెంటనె తాఁబోయి వాసభూమి । నుండు ననిచెప్పె లక్ష్మణ
యోగివరుఁడు॥

తా॥ ఎప్పుడును నాత్మను బుట్టిన జ్ఞానమునకుఁ గారణమైన బుద్ధి యనెడి
కన్నులచేత జ్ఞానమునగనెడి దృష్టి యున్నదనియు నా కన్నుల దృష్టి కామంబు
గప్పి యిచ్చఁబుట్టించి కన్నులఁ గానరాక దోషము నిండి దట్టమై స్త్రీలయందు
నిలిచె ననియు నందున ఫలము స్త్రీలఁ గూడి భోగించునది యనియు దానికి
గావలసినవి చేయరాని కార్యములు చేసు ననియు నిన్ని విధములఁ గన్నులు
గలిగి యుండఁగా గుడ్డివాఁడాయె ననియుఁ దాను బోయెడు తోవ దుఃఖ
రూపమైన నరక మనియు నివి తెలిసి సుజ్ఞానమైన చూపు గలిగి శ్రీభాష్య

కారుల వెనువెంటఁ దాఁ బోయి వాసభూమిస్తైన పరమ పదంబుఁ జేరునని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( ఈ జ్ఞానగుణములు గలిగియుండిన యాత్మకు నజ్ఞాన గుణములు పుట్టించి స్త్రీలయందుఁ గూడిన మనస్సుచేత నరక మనుభవించఁగా నెంబెరుమానారు సంబంధ సంబంధులను గడతేర్తురని యానతిచ్చి దేహ మనిత్యమని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ పొడుగు దేహము నీరు బుగ్గగా యని చూచి కలుములు మెరు పులుగా నెచూచి । తనతోడివారు ముందరఁ బోవఁగాఁజూచి తాపత్రయము క్లేశ తతులఁజూచి । దినములు వోవఁగా దెగునాయువని చూచి కర్మసంగతి బంధకముగఁ జూచి । గర్భజన్మాది సంక్రమణ సప్తావస్థలందు వచ్చెడు దుఃఖ మరసిచూచి । సుజనుఁ డిహలోకపరలోక సుఖములందు । నాసలస్సియుమా నితానాత్మ నెఱిఁగి । మోక్షయత్నంబు సేయుఁదా మోసపోక । చతురుఁ డానసె లక్ష్మణాచార్యవరుఁడు॥ ౭

తా॥ చర్మమాంసాదులైన సప్తధాతువుల చేతఁ బొదుగఁబడిన దేహము నీటిబుగ్గయనియు ఆదేహమునకు వర్ధకమైన సంపదలు వాన మెరుపులనియు తనతోడఁ గూడినవారు తనకన్న మునుపు చనుదురనియు తాపత్రయదుఃఖముల ననుభవింతురనియు దినములు చనిపోవఁగా నాయుస్సు తరిగిపోవుననియు పుణ్యపాప రూపములైన కర్మములు కట్టివేసుననియు గర్భ జన్మబాల్య కౌమార యౌవన వార్ధక మరణాదులైన సప్తావస్థలయందును వచ్చెడు దుఃఖముల ననుభవించుననియు నిన్ని కార్యములును జ్ఞానాధికులైనవారు చూచి యీ లోకములోని దుఃఖములును బరలోకములోని దుఃఖమును మనస్సునఁ బెట్టక రోసి తానాత్మ నెఱింగియు మోసపోక మోక్షయత్నంబు సేయువారని యతండెఱుని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ (దేహమనిత్యమనియు దేహవర్ధకమైన పదార్థము లనిత్యములని యానతిచ్చి యజ్ఞానములు మూఁడు పోయి దివ్యజ్ఞాన సంపన్నుఁడై యుండునని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ జ్ఞానాద్యనుదయ సంజ్ఞా జ్ఞాన మదిముందు దేహాత్మ భేదంబు తెలియనపుడు । అన్యథాజ్ఞాన రూపాజ్ఞాన మీయాత్మ శితికంఠముఖదేవ శేషమనియుఁ । దనకుఁదాఁ గర్తనితలఁచిన యజ్ఞానమది దానె విపరీతమాత్మక నుచు । లక్ష్మీశ శేషత్వ లక్షణం బెఱిఁగిన నజ్ఞానములు మూఁడు నడఁగిపోవు। భాస్కర ప్రభఁజీఁకటి పాసినట్లు । జ్ఞానముదయింప నజ్ఞాన సరణి చెడును। మూల మాచార్యకృపయని ముదముతోడ । నానతిత్తురు మాలక్ష్మణా

ర్యులెపుడు॥ ౮

తా॥ జ్ఞానగుణములుగల యాత్మలకు దేహాత్మభేదములు తెలియనిది యొక యజ్ఞానమనియు అన్యథాజ్ఞాన రూపాజ్ఞాన రూపములైన బ్రహ్మరుద్రాదిదేవతలు మొదలైన దేవతాంతరములకు శేషమనునది యజ్ఞానమొకటనియు తనకుఁ దాగర్తయని తలంచునది యాత్మకు విపరీతమైన యజ్ఞానమొకటనియు నీమూఁడజ్ఞానగుణము లడఁగిపోయే టట్లనియు సూర్యుని వలనఁ జీఁకటిపోయినట్లు యుపదేశమువలన జ్ఞానముపుట్టి నీమూఁడ జ్ఞానములు చెడుననియుని యిన్నిటికిని సదాచార్యుని కృపమొదలని సంతోషముతోడ లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (అజ్ఞానములుమూఁడు సుజ్ఞానోదయము వలన నడఁగిపోవునని యానతిచ్చి యాగు జ్ఞానమనెడి వృక్షమును మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ దేహంబు తానని దేహ సంబంధులు తలవారలనుభ్రమ తన కుఁగలుగ। నజ్ఞాన తరుబీజమది తానె మొలకనై యథకామాపేక్ష లపుడెపుట్టె। బ్రబలి బహువిధపుణ్య పాప శాఖలుగల్గి సుఖదుఃఖఫలములఁ జూపుచుండ। భ్రమ సమూలము గాను బాసిపోయినఁగాని సంసారవృక్షంబు సమయదనుచు। నాత్మ దేహాతిరిక్తమై యచ్యుతునకు। శేషమగుచుండెఁ దద్దాసశేషమగుట। తెలిసి యతిపతి కర్పించఁ దీరునక్షియు। ననుచు లక్ష్మణమునివరుండానతిచ్చు॥ ౯

తా॥ దేహముతాననియు దేహసంబంధులు దనవారనెడి భ్రమ తనకుఁగలిగెనేని యజ్ఞానమనెడు వృక్షమున విత్తుసంపాదించి పాదిచేసి వేసిన మొలకపుట్టెననియు నర్థకామాదులనెడు జలముపోసి పెంచెననియు నానాఁటికిఁ బ్రబలి బహువిధములైన కొమ్మలుపుట్టెననియుఁ బుణ్యపాపములనెడి వృక్షమునకుఁ బ్రధానమైన కొమ్మలను సుఖదుఃఖ ఫలములను జూపుచునుండు ననియు నీభ్రమసమూలముగా వేళ్ళతోఁ బెరికివేసిన నజ్ఞానమనెడి వృక్షము సనసిపోవుననియు నీయాత్మ దేహమునకు వేఱైయుండు ననియు శ్రియఃపతికి శేషమైయుండుననియు నీతీరునఁ దెలిసి యెంబెరుమానారుకుఁ దన యాత్మను సమర్పించిన భ్రమదీరునని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ ( అజ్ఞానమనెడి వృక్ష మెంబెరుమానారు సంబంధమున నశించిపోవునని యానతిచ్చి శ్రియఃపతి యొక్క జాయమాన కటాక్షముమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ హరిసర్వ సముఁడునై యందఱ నొకమాటు ముక్తులఁజేసిన ముగియులీల। యనియొక్కకఁడె చేయుయాదృచ్ఛి కాదులఁ గొన్నిహేతు

వుబగాఁ గూర్చిననీ । జాయమానావస్థ చల్లఁగాఁ జూచిన సాత్వికుఁడై ద్వేష చారిగాక । యభిముఖుఁడై వైష్ణవాకారుఁడై హరిచెప్ప నాచార్యులఁ జే రినప్పుడు । తానుగ్రహకృత్యుఁడౌ వాఁడు తన్నుఁజేరి । సహజకైంకర్య సాం బ్రాజ్య శాలియగుము నవుటఁ జేసియు గురువరు నాశ్రయింప । మోక్ష మని చెప్పె లక్ష్మణ మునివరుండు॥ ౧౦

తా॥ శ్రియఃపతి యొక్క మాటలు సకలాత్మలను ముక్తులఁ జేసె నేనిలీల ముగియునని తొలకఁ దాకండు చేసెడు యాదృచ్ఛిక ప్రాసంగిక మానుషం గికము లనియెడి సుకృతములు గల్పించియు నీచేతను జాయమాన కటాక్ష ముచేతఁ జల్లఁగాఁ జూచిన సాత్వికుఁడై తన్ను సమ్మతింపించుననియు ఆమీఁ ద నభిముఖుఁడయి శ్రీ వైష్ణవాసక్తుఁడై విశ్వాసముగలిగి వారానతీయఁ గా నాచార్యునిం జేరుననియు నప్పుడు తానుగ్రహకృత్యుం డౌననియు నిట్టి యాత్మ తన్నుఁ జేరునట్టియుఁ జేరి నిత్యముక్తులతోడ సహజ కైంకర్య సాం బ్రాజ్యమునకు నర్హుఁడౌననియు నగుటంజేసి యాచార్యుని నాశ్రయింప మోక్షమని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ ( శ్రియఃపతిని నిర్హేతుకజాయ మానకటాక్షము నానతిచ్చి పరులదోషములు చూడక తనదోషములే చూడ వలెనని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ తనదోషములఁ బరస్థలగుణములఁ జూడ నను వైన సుజ్ఞానమ మరినపుడు। భ్రమదీర నార సంబంధ బంధువులుగా దేహసంబంధులఁ దెలిసినపు డు । అధికపరాభ్యుదయానర్థములఁ జూచి తనవనిమదిలోనఁ దలఁచినపుడు। నిం దాస్తుతులు తన్ను నెందఱు సేసిన నీరెంటికిని నర్థ మెఱుంగనపుడు । హేయార్థ ర్మంబు సిద్ధంబు నెఱింగినపుడు అర్థకామ పరాపేక్ష లడఁగినపుడు । తానె మో క్షాధికారి యీ ధరణిలోన। ననుచు లక్ష్మణ మునివరుం డానతిచ్చె॥ ౧౧

తా॥ తనదోషములను బరస్థల గుణములను జూడనోడఁబడిన సుజ్ఞా నమునయు బంధువుల యెడ దేహసంబంధులని భ్రమపడక నారసంబంధు లని నిశ్చయించవలె ననియు అధికమైన యనర్థములు పరులకువచ్చె నేని యా యనర్థములు తనవనిమనస్సునఁ దలఁచినప్పుడనియు నిందలను స్తుతులను ద న్నునెందఱు సేసినను నా రెంటికిని నర్థ మెఱుఁగనివానివలె నుండవలెననియు హేయధర్మమే సిద్ధధర్మమని యెఱింగినప్పుడనియు నర్థకామాదులమీఁ దను బరమపదమునందు నపేక్ష మానవలెననియు నప్పుడు తాను మోక్షాధి కారి యీభూమిలో ననుచు లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ ( మోక్షాధికారికి

విలక్షణమైన నిలుకడ నానతిచ్చి దేవ తాంతరములచేత నీయాత్మ నశింపఁగానే లినవాఁడు రక్షించునని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ అన్యథాప్రతి పత్తి యనురావణునిచేత సపహృతమైన యీయాత్మసీత । సంసారసాగర సంవృత దేహాఖ్యలంకలోశోక సంలగ్నయగుచు । శారీరబంధురక్ష స్త్రీలచేనొచ్చి సజ్జనత్రిజజాతి సక్తిఁజేరి। యంతటఁజేశకాఖ్యాంజనేయో క్తిసన్మంతార్థమునసనాథు మహిమఁదెలిసి । యెదుర చూడంగ యతిశేఖరినకులుండు । నిజజనంబులతో వచ్చిశిఖరిశత్రు । నాశమొనరించికొనిపోయి నాన్నుఁడగుచుఁ । దృప్తుఁడౌనసనె లక్ష్మణదేశికుండు॥ ౧౨

తా॥ దేవతాంతరమను రావణునిచేతఁ దన యాత్మయనియెడి సీతాదేవిని నెత్తుకొనిపోఁబడెననియు సంసారమనియెడి సముద్రముచేతఁ జుట్టఁబడినదేహమనియెడి లంకలోపలను జెరనుంచఁగాఁ జాలదుఃఖముతోడఁ గూడియుండెననియుఁ దనశరీర సంబంధులను రాక్షసస్త్రీలచేత నొచ్చి గవిల బాధల బడియున్న సమయమున సజ్జనులనియెడు త్రిజట సరమలయొక్క సక్తి వలనను వారువెరువకుమని విన్నపము సేయఁగా నప్పుడప్పుడు దుఃఖము శాంతమైనటులున్న నంతట నాచార్యుఁడనెడి హనుమంతుఁడు ముద్దుటుంగరము సమర్పించి మేలిపవాని మహిమ లేకాంతమున విన్నవించెననియు నాసీతాదేవి తనకు నాథుఁడైన శ్రీరఘునాయకునిరాక కెదురు చూచుచుండె ననియు నొంకెరుమానారనియెడు రామచంద్రుఁ డాసముద్రమును నింకించి రావణకుంభకర్ణాది సమస్తరాక్షసులను సంహరించి సీతాదేవిని గూడుకొనితిరిగి యయోధ్యకుఁ బుష్పకారూఢులై వేంచేసి పట్టాభిషేకముఁ జేసుకొని సుఖము లనుభవించుచుండిరని లక్ష్మణాచార్యు లానతిచ్చిరి॥ ( ఈయాత్మ చెరనుండఁగా నాచెరవిడిపించి యేలునని యానతిచ్చి పరిభవపరులను నుపకారులు వీరెయనుమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ తాడన పరశోక్తి తజకనాదులుతన్నుఁ బరిభవింపుచు నున్నఁ బరులఁజూచి । దేహంబునేనని తెలిసినా దీయాత్మ వేఱని తెలియని వెఱ్ఱిలనుచు । నవ్వివిరోధిని నలిశాడిదిదిమనపనిచుని మెచ్చితా పరిణమించి । యాత్మేశ్వరుండగు హరిగదాచింతించుననియోర్చి మఱియునతండుమీరి । తనకుఁగాఁ జెరచకుండంగ దయయుఁజేసి । తనకు నుపకార కులుగానె తలఁచినపుడు । వైష్ణవత్వంబు నిదిదాంతి వలనఁ గలుగు । ననుచు లక్ష్మణముని వరుం డానతిచ్చు॥ ౧౩

తా॥ కొట్టు తిట్టు మొదలైన శరీర బాధలు పెట్టి తన్నుఁ బరిభవించిన పరులఁ జూచినప్పుడు దేహమును నాయాత్మయును వేఱని తెలియని వెఱ్ఱివారలనియు ఆత్మకు శరీరమువిరోధి యీవిరోధిని దండించునది మనము చేసెడు సేతయని వారే చేసిన మంచిదని సంతోషముగా నుండవలెననియు వారియందు సంతోషముగానుండి యీయాత్మకుఁ గర్తనైన శ్రియఃపతి కదా చింతించునవియు కోర్చి మఱియు దాసునికొఱకు కట్టివారిని శౌరచ వలదని యతనియందు విన్నపము చేసుననియు తనదయచేతఁ దనకు వీరుపకారులు గానే తలంచినపుడును శ్రీవైష్ణవత్వమీ చాంతి గుణములవలనఁ గలుగుసని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (పరిభవపరుల నుపకారకులుగాఁ దలంచి చాంతిగుణముల తోడ శ్రీవైష్ణవుం డుండవలెనని యానతిచ్చి యీగుణము లుంటకు హేతువు నీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ శ్రీశభక్తి విరక్తి సిద్ధసాధనవృత్తి క్షుద్ర సర్వోపాయ శూన్యతలును। గలిగినసీఁదటఁ గలుగు చాంతి విశేష జనిత గుణంబులు సంభవించు। వైష్ణవత్వంబిదియు వర్తనచెడఁ దన్నుఁ బరిభవించెడు దుస్స్వభావులందు। క్షాంతిసంతోషోపకార సంస్మృతిదయా స్మితములఁజేసి నిశ్చిత్తుఁడౌట। యట్లుగాకున్న భక్తియే కాయమునకు। నల్పవిషయవిరక్తి దిగంబరునకుఁ। గడమరెండును కేవల కర్మబద్ధు। లకును గలదట్టి చాంతియో లక్ష్మణార్య॥ ౧౪

తా॥ శ్రియఃపతియొక్క తిరువడిఘళి యందు భక్తియు విరక్తియు సిద్ధధర్మము నడకయును గలిగి క్షుద్రములైన సర్వోపాయముల విడవవలెననియు, నామీఁద చాంతి విశేష గుణములును గలిగి యుండుననియు శ్రీవైష్ణవత్వం బిటువలెననియు నానడత చెడి తన్ను దూషించిన దుర్బుద్ధి పరులయందునోర్పును సంతోషమును నుపకార స్మృతియు దయతోఁగూడిన చిఱునవ్వును గలిగినిశ్చింతుఁడై యుండవలెననియు నటువలెఁగాకుండెనేని భక్తియే కాయమునకుఁ గలదనియు నల్పవిషయ వైరాగ్యము దిగంబరునకుఁ గలదనియుఁ గడమ చాంతి క్షాంతులును రెండును గర్మజ్ఞానముల నెడి కైవల్యపరులకును గర్మబద్ధులకును గలదని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (చాంతిక్షాంతులు శ్రీవైష్ణవునికే నుండవలెనని యానతిచ్చి శ్రీవైష్ణవలక్షణములను నీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ కేవలాచార్య సత్కృపచేత మొదటను బంచ సంసారరసం పదలఘించి। యర్థపంచకతత్వ యాథాత్మ్యవిజ్ఞాన తత్ఫలాకార త్రితయ

ముగలిగి । యభిజన ప్రఖ్యాత్యహంకార ముఖ్యోక్త తత్త్రయాపేతు లగు లుమాని । పరదోష నిజగుణ ప్రకటోక్తులను బరస్తుతినిందలనుమాని సుగతిఁ దెలిసి । తత్పర స్వచ్ఛహృదయుఁడై తగిలినట్లు । విష్ణువైష్ణవ నిజగురువిషయదాస్య । మెఱిఁగితనశక్తికొలఁదిని నెపుడుఁ జేయ । మంచిదనిచెప్పె లక్ష్మణ మౌనివరుండు॥ ౧౫

తా॥ సంసార నివృత్తకమైన తిరుమంత్రప్రదుఁడైన యాచార్యుల కృపచేతఁ బంచ సంస్కారాదులును నూర్ధ్వ పుండ్రములును దిరువారాధనమును లభించవలెనని స్వస్వరూప పరస్వరూప పురుషార్థస్వరూప ఉపాయస్వరూప విరోధి స్వరూపము ననియెడు నర్థపంచకముల నెఱుఁగవలె ననియు నాత్మకుయథార్థమైన జ్ఞానముగలిగి స్వరూపమునకు ఫలితమయిన శేషత్వపారతంత్ర్య కైంకర్యములు మూఁడును గలుగవలెననియు ఆభిజాత్యమును ఖ్యాతియు నహంకారమును వీనియందపేతులను బుట్టింపఁగల యీషణత్రయ మందపేతులను మాని యుండవలెననియు పరులదోషములను దన గుణములను బ్రకటన చేయకుండవలె ననియు పరులను స్తోత్రము చేసెడునదియు పరులను నిందించునదియు మాని యుండవలెననియు మంచిమార్గము దెలిసి నిత్యవిభూతియందుఁ దత్పరస్వచ్ఛ హృదయుఁడై తగిలినటుల శ్రియఃపతియందును శ్రీవైష్ణవులయందును సదాచార్యుని యందును భయము భక్తి గలిగి దాస్య మెఱిఁగి తన శక్తికొలంది యెప్పుడు కైంకర్యపరుఁడై యుండుట మంచిదని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శ్రీ వైష్ణవత్వ లక్షణములును నడతలును నానతిచ్చి యేకాంతిపరమై కాంతిపరుల నెఱింగినవారి యభిమాన నిష్ఠుండై యుండవలెనని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ జడదేవ తాంతర శబ్దాదులను రోసి విష్ణు భక్తినిజేరు వైష్ణవుండు । మాధవాంఘ్రిద్వయ సాధనుండై యన్య మేకాంతిమాని లక్ష్మీశుఁ జేరు । స్వస్వామి సంబంధ సాధన నిష్ఠుఁడై చేరుఁబరమైకాంతి శ్రీరమణుని । నేకాంతియనుబర మైకాంతియనుముఖ్యు లందులో నధికుని నాశ్రయించి । తదభిమానంబె తనకు సాధనముగాను । దలఁచి ఫలమును దదనువర్తనముగాను । నుండు రభిమాన నిష్ఠులై యోగిపురుష । లనుచు లక్ష్మణ మునివరుండానతిచ్చు॥ ౧౬

తా॥ అయోగ్యములైన దేవతాంతరములయందు శేషపడక శబ్దాదులైన విషయములనురోసి విడువవలెననియు విష్ణు భక్తిని దృఢముగాఁజేరిన శ్రీవైష్ణ

పుండు ద్వయమే యుపాయముగా నుండిన వాఁడై యన్యమైన యేకాంతిమేలువిడిచి శ్రియఃపతిని జేరుననియు తనకు నేలిన కర్తలనెడి సాధన నిష్ఠగల వాఁడైన పరమైకాంతి శ్రియఃపతిని జేరుననియు ఏకాంతియును బరమైకాంతియును నిందులో ముఖ్యులై యధికులైనవారిని నాశ్రయించి వారియభిమానమే తనకు ఫలముగాఁ గని యాఫలము విడువక యనువర్తనగలిగి యుండునో కానొక మహాత్ముండని లక్ష్మణార్య లానతిచ్చిరి॥ ( ఏకాంతి పరమైకాంతిపరుల సహవాసము మంచిదని యానతిచ్చి పరతంత్రునికిఁ దనయత్నములు మానవలెనని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ ఈశ్వర పరతంత్రుఁ డీయాత్మ తానని యరసి స్వయత్నసాధ్యనులుమాని । యాత్మాపహార రూపాపరాధము తీర మంత్రరత్నం బాకమాటునుడివి । యనుమతి రప్పించి యాత్మేశ్వరుఁడు దానె తన కిష్టముగనన్నుఁ దన్నుఁజేర్చు । నని విశ్వసించిన యతఁడీశ్వరుని జేరి యానంద నిర్భరుండగుచునుండు । నిచట నచటను నెచటను నితనికతఁడు । భర్తయునునంతరాత్మయుఁ బాలకుఁడును । నతని కితఁడును దేహంబు నాలుగనుక । యనుచు లక్ష్మణ మునివరుం డానతిచ్చు॥ ౧౭

తా॥ శ్రియఃపతికిఁ బరతంత్రుఁడీ యాత్మయని యెఱిఁగి, తనయత్నము వలన సాధించితిననెడి తలంపు విడువవలెననియుఁ దనయాత్మను దానెయపహరించిన నపరాధములు తీరిపోవేటట్లు తిరుమంత్రరత్న మొకమాటుచ్చరించి యామంత్రము ప్రసాదించినవారి యనుమతితో నందలి యర్థమును విని యనుష్ఠించిన మాహాత్ముండనియు శ్రియఃపతి తానె తనకిష్టముగల దాసుని దన్నుఁ జేర్చుకొను ననియు మహా విశ్వాసముగల యతండు శ్రియఃపతిని జేరి యానందనిర్భరుం డామెననియు నతం డిక్కడనక్కడ నెక్కడనైనను నితనికితండు పెనిమిటియు నాత్మకు నంతర్యామియుఁ బరిపాలించెడువాఁడును నతండె యనియు నతనికితండు శరీరమును భార్యయునునై యుండునని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( మంత్రార్థపరులై యనుష్ఠానముగల మహాత్ములను శ్రియఃపతి లెస్సగా నేలునని యానతిచ్చి సాధనాంతరములు మానవలెనని మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ ॥ సర్వేశ్వరుని నమ్మ జాలక తాఁగొన్న సాధనాంతరముల జరిపెనేని । హనుమంతు నింద్రజిత్తస్త్రంబుచేఁ గట్టి విశ్వసించక నాచ్చు విధముపచ్చు । నపచారములు దన్ను నంటకుండఁగ నెలగి తప్పించుకొని పోవఁ

దలఁచఁడేని । యభిమన్యుఁ డావ్యూహమందుఁ జొచ్చేవల వెడల నేరక సమ
య విధము వచ్చుఁ । దప్పదీరెండు విఘ్నముల్ తప్పనేని । చెప్పనేటికి మో
క్షంబు చేఁతిలోని । దప్పవాఁడింతె లక్ష్మణుఁ డనుచు దయను । దెలియఁ జె
ప్పును లక్ష్మణదేశికుండు। ౧౮

తా॥ శ్రియఃపతి దాసుండై యతనినమ్మఁ జాలక తాఁ గొన్ని సాధనాంతరములఁ జేయుచుండెనేని హనుమంతుని నింద్రజిత్తు దన బ్రహ్మాస్త్రముచేఁ గట్టి యాయస్త్రమును విశ్వసించక తమయత్నములైన మోకులఁ గట్టిరనియు నా మోకులస్పర్శవలన బ్రహ్మాస్త్రము విడిచిపోయిన లంకఁ గాల్చి తిరిగి సముద్రము దాఁటి జానకీ యోగక్షేమము రాఘవునకు విన్నపముఁ జేసినటులనియు భగవద్భాగవతాచార్యాపచారములు దన్నంటకుండునటు తప్పించుకొని మెలఁగవలెనని తలంచకుండెనేని యభిమన్యుఁడు వ్యూహములోఁ జొచ్చి యావల వెడల నేరక యావ్యూహములోనే సమసి పోయినట్లనియు నీరెండు విఘ్నములును దప్పదు అటుల దప్పనేని చెప్పనేల మోక్షంబు చేఁతిలోని దనియు శ్రియఃపతి యితనికి నప్పులవాఁడై యుండునని కృపచేతను లక్ష్మణార్యు లానతిచ్చిరి ॥ (అపచారములకు వెరచి యుండెనేని సులభముగ సుగతిని జేరునని యానతిచ్చి ప్రపత్తిపరులైన శరణాగతుల వైభవము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ సత్కర్మ నిరతులు సాంఖ్యయోగజ్ఞులు భక్తులు ననవెందఁ
ప్రబలునైన । శరణాగతాచ్యుత జనవైభవముఁ జూడ నందులోఁ గోటి
భాగార్హతయును । లేదిందుదుష్కరత్వాది వైషమ్యంబు గలదది తత్ప్రి
సంగములుమాని । భరసమర్పణఁ జేయు భగవత్ప్రియుల నెఱిఁగి వారభి
మానమించుకైనఁ। గలుగ వర్తించ నేర్చిన ఘనులఁ జేరి । సేవఁ జేయుచు నుం
డెడు చేతనులకు । మోక్షమరచేఁతి దైయుండు ముందుగానె। కొదువలేదనె
లక్ష్మణ గురువరుండు॥ ౧౯

తా॥ కర్మజ్ఞాన భక్తిప్రపత్తి మొదలగునుపాయములలోఁ బ్రబలమైన శరణాగతుల వైభవములలోఁ గోటికనొక భాగమునకు నా యుపాయాంతరములు సమముగా లేవనియు నందుకు నశక్తియు నప్రాప్తమును గలదుగాన నాప్రసంగములు విడిచి తమయాత్మను సమర్పణముఁ జేసెడి ప్రపన్నుల నెఱిఁగి వారి యభిమాన మించుకంతైనను గలుగవర్తించ నేర్చిన ఘనులఁ జేరి సేవఁ జేయుచునుండెడు చేతనులకు మోక్షమరచేఁతిదై యుండును ముందుగాఁ గొదువ

లేదని మహిమతోడ లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ప్రసన్నులైన వారి మహిమ లానతిచ్చి సుజనులైన మహాత్ములను మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ లక్ష్మీశ్వరుఁడే దైవ మీక్ష్మ తలంబున సులభుండు ననువారె సుజనులిచట । శ్రీవైష్ణవులె మాకు సేవ్యులెందును నని శుభమఁ గోరెడు వారెసుజనులిచట । హరికివైష్ణవులకు నారగింపులుజేసి సుఖముఁ జేసెడు వారె సుజనులిచట । నెంబెరుమానారె యీయర్థములనెల్లఁజూపం దెలిసి నవారె సుజనులిచట । ననుచు సుజనుల వెదకి తానందుఁ గూడి । మోక్షరుచి గల్గి యపచారములకు వెరచి । భగవదనుభవ కైంకర్యపరుఁడు నగుచు । నుండవలెనని లక్ష్మణ యోగివరుఁడు॥ ౨౦

తా॥ ఈ భూమిలోపల శ్రియఃపతే దైవము సులభుండతండె యనిన వారు సుజనులీ భూమియందనియు శ్రీవైష్ణవులే మాకు స్వాములని వారి సేవలును వారి శుభములును గోరెడినారే సుజనులనియు శ్రియఃపతికిని శ్రీవైష్ణవులకును నారగింపులు చేయించి సంతోషము చేసెడువారే సుజనులిచటయనియు నెంబెరుమానారు చూపిన యీ యర్థములనెల్లఁ దెలిసిన వారే సుజనులనియు సుజనుల వెదకి తానందుఁగూడి మోక్షమందు రుచిగలిగి యపచారములకు వెరచి భగవదనుభవమందుఁ గైంకర్యపరుండు నగుచునుండవలెనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (సుజనులైన మహాత్ములవైభవము నానతిచ్చి ప్రకృతివికారము పోయినఁ దనయాత్మస్వరూపమును నెఱుంగునని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ ప్రకృతి వికార విప్రతిపత్తి పోయినఁ బంచ వింశజ్ఞాత్మ భావ మెఱుఁగు । నెఱిఁగి స్వాతంత్ర్య ప్రంబు లితనికి లేకున్న విష్ణు శేషత్వైక వేష మమరు । నమరియుపాయాంత రాసక్తి మానిన సిద్ధసాధన వరణ సిద్ధి గలుగుఁ । గలిగి యున్నైశ్వర్య కైవల్య భ్రమదీర భగవదంఘ్రి ద్వయ ప్రాప్తిఁ జేరుఁ । జేరితాభోక్త ననకున్న శ్రీశునిష్ట । మైన వృత్తియు సిద్ధించు ననుచు దయను । దాఁచ కిటువలె నాత్మహితంబుఁ జెప్పు । చుండు నెప్పుడు లక్ష్మణ యోగివరుఁడు॥ ౨౧

తా॥ ప్రకృతి వికారములు పోయియుండెనేని యిరువది యయిదవ వాఁడని లీనయాత్మ నెఱుఁగు ననియు నెఱిఁగిన వెనుక స్వతంత్రం బితనికి లేకుండెనేని వైష్ణవ శేషత్వమునకు వేష మమరుననియు నమరెనేని యుపాయాంతర ములు మీఁది యాశమానిన సిద్ధ సాధనమైన ప్రాప్య ఫలము చేరయోగ్యతగలు

గునని యుఁ గలిగియు నైశ్వర్య కైవల్యములయందు భ్రమలు దీరి శ్రియఃపతి తిరువడిఘళ్ళుచేరి ప్రాప్తిఁ బొందుననియుఁ జేరి తానుభోగించెడి కర్తయనకున్న శ్రియఃపతికి నిష్టమైన కైంకర్యము సిద్ధించుననియు మహాకృపతోడ దాఁచక నిటువలె నాత్మకు హితవానతిచ్చిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ప్రకృతి గుణములు పోయినఁ దన యాత్మస్వరూపముఁ గానవచ్చునని యానతిచ్చి శేషత్వ పారతంత్ర్య కైంకర్య ఫలము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ దేహంబు తనకు విధేయమై నప్పుడె రుచిఁ జేయు గాకున్న
రోయఁ జేయు। రత్నంబు రోచిష్కరంబైన యప్పుడె రుచిఁజేయుఁ గాకున్న
రోయఁ జేయుఁ। బుష్పంబువాసన పూర్ణమై నప్పుడె రుచిఁ జేయుఁ గాకున్న
రోయఁ జేయు। నట్లు శేషత్వ పారతంత్ర్యములు గలిగి। శేషి కతిశయ
పరుఁడైన చేతనుండె। భగవదనుభవ యోగ్యుఁడై పరఁగులేక। యున్న
గాదనె లక్ష్మణ యోగివరుఁడు॥ ౨౨

తా॥ తన దేహము యవ్వనమై యుండెనేని రుచించి యుండు ననియు వార్ధకమై యున్నప్పుడు రోయఁ జేయుననియుఁ జాలు మధురమై యున్నప్పుడు రుచించి యుండు ననియుఁ జాలు నీరమై నప్పుడు రోయఁ జేయుననియు రత్నమునకుఁ బ్రకాశము గలిగినప్పుడు రుచించి యుండుననియు లేనప్పుడరుచిమై యుండుననియుఁ బుష్పమునకుఁ బరిమళము గలిగి నప్పుడు రుచిమై యుండుననియు లేనప్పుడరుచిమై యుండ దనియు నటువలెనే యీ చేతనునికి శేషత్వ పారతంత్ర్యములు గలిగినప్పుడు శ్రియఃపతికి నతిశయపరుఁడై యుండుననియు లేకున్నప్పుడర్హుండు కాఁడని లక్ష్మణార్యులానతిచ్చిరి॥

గద్య॥ ఇది మః ముముక్షుజనకల్పకంబను మహాప్రబంధంబునందు శరీరావసాన కాలంబున నాత్మ యుత్క్రమించెడి ప్రకారంబును నుత్క్రమించి స్వర్గనరకా ద్యనుభవంబుఁ జేసి కర్మ శేషంబులోడ నీలోకంబునకు వచ్చి మనుష్యాదియోనుల జన్మించెడి ప్రకారంబును సంసార క్రౌర్యాను సంధానంబుఁ జేయవలసి చేతనుని జెరనున్న వానినిగా సముద్రములోఁ బడ్డవానినిగా సర్పదష్టునిగా నంధునిగా ననుసంధించెడి ప్రకారంబును దేహాస్థిత్వాదులయ నిత్యత్వాను సంధానంబును జ్ఞానోదయాన్యథా జ్ఞాన విపరీతజ్ఞానరూపజ్ఞాన త్రయ లక్షణంబును సంసార వృక్షమూల మహంకార మమకారంబు లనియును భగవత్కటాక్షమే సంసారోత్తరణ హేతు వనియును మోక్షాధికారి లక్షణంబును బద్ధాత్మలకు లంకారుద్ధ సీతా సామ్యంబును

ముముక్షువు సజ్ఞానులు పరిభవించి నప్పటి యను సంధాన ప్రకారంబును దాంతి జనిత క్షాంత్యాది గుణయుక్త వైష్ణవత్వం బనియును నాచార్య కృపను బంచ సంస్కారాది లాభప్రాప్తి మంచి దనియును వైష్ణవ మేకాంతి పరమై కాంతి లక్షణంబును పారతంత్ర్యాను సంధాన ప్రకారంబును సాధనాంతర ప్రవృత్త్యాపచార క్రౌర్యంబును నుపాయాంతరనిష్ఠులకును శరణాగతులకును నంతర మహదంతర మనియును సుజన లక్షణంబును బ్రకృతి వికారాది ప్రతిపత్తులు పోయిన స్వరూప ప్రకాశ లక్షణంబును శేషత్వ పారతంత్ర్యంబులు గలిగిన యాత్మ భగవ దనుభవయోగ్యుడనియు నన్నది షష్ఠమ ప్రకరణము.

అచ్యుత శఠకోప యతిరాజ వరవర నిజగురుభ్యోనమః.



శ్రీమతేరామానుజాయనమః.

## ము ము క్షు జ న క ల్ప క ము.

### సప్తమ ప్రకరణము.



శేషత్వ పారతంత్ర్యంబు గలిగిన యాత్మభగవదనుభవయోగ్యం డగునని యానతిచ్చి యాచ్చి వేంకటాచార్యులును లక్ష్మణార్యులును దమ్ము గటాక్షించినది మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ ఆచ్చి వేంకట లక్ష్మణాచార్యులను వార లిద్దరికడ నుండి హితవుఁ జెప్ప । మాధవాంఘ్రిద్వయ సాధన సాధ్యులై కరుణతోఁ జాల యిక్కడికివచ్చి । మ్లేచ్ఛవర్తను నన్ను మిక్కిలి కృపఁ జేసి యందునొక్కఁడు మంత్ర మానతియ । నర్థంబు మఱియొక్కఁ డానతిచ్చుటఁ జేసి శ్రీశాంఘ్రులని వీరిఁ జింతఁ జేతు । నట్లుగాకున్న శఠవైరి యతివరాఖ్యు । లైనఁగావలెఁగాని వేఱన్యులైన । నారమాధీశు సంబంధ మానతిచ్చి । కాచిరక్షించు శక్తియొక్కనికిఁ గలదె॥

తా॥ ఆచ్చి వేంకటాచార్యులును లక్ష్మణాచార్యులును మిక్కిలి కృప యుంచి హితవుఁ జెప్పిరనియు శ్రియఃపతి తిరువడిఘళు రెండును రెండురూ

పనులై ప్రాప్యఫలమును సాధించ సమర్థులైన వారు తామె. యిక్కడికి వేం చేసిరనియు నీచ వర్తనుండైన దాసునిఁ గృపఁజేసి యీయిద్దరిలో నొకరు మంత్రమైన తీయఁగా నొకరు రత్నమాన తీయఁగాఁ దన కులభించెననియు వారిద్దరిని శ్రియఃపతి తిరువడిఘళేయని తప్పక దాసుఁడు చింతింతును నటువలెం గాకున్న నమ్మాళ్వారులును నెంబెరుమానారులును వీరువు రైనఁగా వలెం గాని వేఱన్యులైనను నా శ్రియఃపతి సంబంధమానతిచ్చి కాచిరక్షించు శక్తి యొకరికిఁ గలదా యని లక్ష్మణాచార్యు లానతిచ్చిరి॥ (ఆచ్చి రామానుజయ్య గారు ఆచ్చి వేంకటాచార్యుల వైభవమును లక్ష్మణాచార్యుల వైభవమును నానతిచ్చి శ్రియఃపతి వైభవము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ కారణంబై యాత్మ గలిగించి యటు మీఁద రక్షకుండై యనా తరము గాచి। శేషియై భర్తయై జ్ఞేయమై స్వామియై ప్రాపకంబును సర్వ బంధువులును। నాధారమును నంత రాత్మయుఁ బ్రాప్యంబు భోక్తయును దివ్య పురుషుఁ డొకఁడె। యాత్మార్థియై దేశి కాకారుఁ డగుననిసూచించు మంగళ సూత్రమొకటి। కంఠలగ్నము హృదయ సంగతముఁ జేసి। యాత్మ యువర్గంబుఁ గొనిపోయి యచ్యుతాఖ్య। నిలయమునఁ బెట్టి భోగించు నిత్యముక్త। యుక్తముగఁ జేసె లక్ష్మణ యోగివరుఁడు॥

తా॥ కారణ భూతుండైన శ్రియఃపతి యీయాత్మను దమ తిరుమేను నం చే కలిగించుననియు నాయాత్మకు రక్షకుండై యనవరతమును నేడవాయ కయుండి రక్షించుననియు నీయాత్మకు శేషియై భర్తయై జ్ఞేయమైస్వామి యైయుండిఁ బ్రాపకమును సర్వవిధ బంధుండనియు నాధారమును నంత రాత్మయును బ్రాప్యంబును భోక్తయును దివ్య పురుషుఁ డొకండె యనియు నాదివ్య పురుషుండైన శ్రియఃపతి యాత్మల రక్షించెడి కొఱకు నాచార్యుం డైవచ్చి యాత్మకు మంత్రమనెడి మంగళ సూత్రము గట్టి మనస్సుకు నొడబా టుపుట్టించి యీయాత్మలను గొంపోయి శ్రియఃపతి తమ కునికిపట్టైన దివ్యలో కమునం జేర్చి నిత్య ముక్తులలోఁ గూర్చి సకల విధ కైంకర్యములును దమ కిష్టముగాఁ గొన నవధరించునని లక్ష్మణాచార్యులానతిచ్చిరి॥ (శ్రియఃపతి యీ యాత్మల గలిగించి తానె యాచార్యుండై వేంచేసి రహస్య ముపదేశము చేసి పరమ పదమునఁ జేర్చునని యానతిచ్చి ద్వయము యొక్క వైభవము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ సర్వాత్మలకుఁ దల్లి సర్వేశ్వరుని పత్ని గాంతునిఁ బాయని కనుఁగొలిచి। సౌశీల్య వాత్సల్య సౌలభ్య ముఖగుణ సాగరుండగు స్వామి చరణయుగము। సాధనంబుగనమ్మి సర్వథాలక్ష్మి విశిష్టవిగ్రహు జగచ్ఛేషికొలు కు । నిష్టకైంకర్యంబు లెఱిఁగిచెప్పినరీతిఁ జేసిసంతోషింపఁ జేతుఁ గాఁగ । నా కునేనవనిచేసిన నష్టిఁబొందు । ననుచుఁ జెప్పెడి మంత్రరత్నార్థ మెఱిఁగి । మా ధవేష్టంబుఁ జేయులక్ష్మణ మునీంద్రు । కరుణగలిగిన నిహపరగతులుగలవు॥ ౩

తా॥ సకలాత్మలకుఁ దల్లియై శ్రియఃపతికిఁ బత్నియై పతిని నెడబాయని యా పెరియపిరాట్టిని బురుషకార భూతురాలని కొలువ వలెననియు సౌశీల్య వాత్సల్య సౌలభ్యములు మొదలైన కల్యాణ గుణములకు సముద్రుఁడైన శ్రియఃపతి చరణములు కొలువ వలెననియు వీరిద్దరి సేవలును ఫలమనినమ్మి యె ప్పుడా శ్రీదేవినిగూడి వేంచేసియున్న విగ్రహము కొలుకు నిష్టమైన కైంకర్యం బు లెఱింగి చేయవలెననియు నీరీతిఁ జేసి సంతోషముఁ జేతుఁగాని నాకు నేనని చేసిన నిష్టిఁబొందుననియు ననుచుఁ జెప్పెడు మంత్రార్థ మెఱుఁగ వలెననియు శ్రియఃపతికి నిష్టముఁ చేసెడు నాచార్యుని కృప గలిగనేని యిహపరగతులు గలవని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( శ్రియఃపతిని ద్వయము వలన నెఱిఁగి యా చార్యకృపకుఁ బాత్రులైన వారికి నిహపరగతులు గలవని యానతిచ్చి చరమ శ్లోక మహిమ మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ యోగ్యతో పాతక యుక్త ధర్మను లెల్ల రుచి వాసనలతోడ రోసివిడిచి। యుపదేష్టనైననన్నొకరిని నిరపాయసాధనంబుగనమ్ముసర్వశక్తి। యుక్తుండననినమ్మి యున్న నిన్నిప్పుడె మోక్షవిరోధి నిర్ముక్తుఁజేతు। దుఃఖంబు మాని సంతుష్టుండ వగుమనీ యర్జున వ్యాజాన నస్మదాది। హితవుఁ జింతించి యపుడుసర్వేశ్వరుండు। ఆనతిచ్చినచరమార్థమాయతీంద్రుఁ। డెఱిఁగిచెప్పంగ మనదాఁక నిపుడు వచ్చెఁ । దెలియుఁ డిదియనె లక్ష్మణ దేశికుండు॥ ౪

తా॥ యోగ్యములై యుండియుఁ బాతకములై యుండెడి ధర్మములను వాసనతోఁ గూడ నేవగించి విడువవలె ననియు నిట్టి యుపదేశము చేసెడు నన్ను నొకరునిబట్టి నీవలన నొకటి కావలసి యుపదేశించుట గాదు నమ్మ మనియు నేను సర్వశక్తిగలవాఁడనియు నమ్మియున్న నిన్నిప్పుడె మోక్షవిరోధ ములైన బంధములఁ బోఁగొట్టి నిర్మలునిఁ జేతుననియు దుఃఖముమాని సంతో షచిత్తుండవుగమ్మని యర్జున వ్యాజముగా శ్రియఃపతి యానతిచ్చిన యర్థ మస్మ దాదులు మొదలైన పామరుల రక్షించవలెనని యెంబెరుమానారు హితము

దలంచి యానతీయఁగా మనదాఁక వచ్చెఁగాన నీయర్థము తెలియరాదని లక్ష్మ
ణార్యులానతిచ్చిరి॥ (చరమశ్లోకవైభవమానతిచ్చి రహస్యత్రయముయొక్క
గోప్యము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఉపనిష ద్గుహ్యమై యుండునే యర్థంబు ఏ యర్థ మాత్మకు హి
తతమంబు। మహిని బద్ధనిమిది మాళ్లు తాఁమెడఁదాకి యతిరాజులే యర్థ
మధికరించి। మాసోపవాసినై మఱికూర కులనాథుఁడే యర్థమెఱిఁగె య
తీంద్రువలన। నేయర్థమెఱిఁగి తానిల మొదలి యాండానుభక్తితో బానిస
పనులఁజేసె। నట్టియర్థంబులెల్లను నస్మదాది। తృప్తజనులకు మొదలుగాఁ
దెలియఁజెప్పి, బ్రతుకె డెలిసిన వారలు బ్రతుకుఁడనుచుఁ। గువలయంబున
లక్ష్మణ గురువరుండు॥

తా॥ వేదాంతములైన యుపనిషత్తులకు గుహ్యమై దాఁచిన యే యర్థ
మగలదో యాయర్థ యాత్మకు హితమైన బుద్ధియనియు నెంబెరుమానారు
లు పదునెనిమిది మాఱు లెడదాఁకి యేయర్థ మధికరించిరనియు మాసోప
వాసినై కూరత్తాళ్వారు లెంబెరుమానారు వలననే యర్థము లభించిరని
యు మొదలి యాండాను భక్తితోనే యర్థముకొఱకు బానిసపనులు చేసిరని
యు నట్టియర్థంబును కృపచేసి దాసుఁడు మొదలైన బద్ధులకు నానతిచ్చిరని
యు బ్రతుకఁ దెలిసినవారలెల్ల బ్రతుకుం డనుచు లక్ష్మణార్యులానతిచ్చిరి॥
(ఉపనిషత్తులకు రహస్యమైన యర్థము నానతిచ్చి పిరాట్టిఘటకత్వమునుమీఁద
నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఆత్మేశ్వరులభేద మడఁచి కూర్చెడి తల్లి ఘటకత్వ ముండెడి క్ర
మముఁ జెప్పి। యఖిల కర్మాద్యుపాయాంతర వ్యావృత్త సిద్ధసాధన ప్ర
తిపత్తులుజెప్పి। సత్ప్రపన్నులనిత్య చర్యా ప్రకారంబు తద్దేశికానువర్త
నముఁ జెప్పి। హేత్వంతరంబులే దీశ్వరకృపకని వరగురు సాధనత్వము
నుజెప్పి। వచనభూషణ శాస్త్ర నిర్వాహమిట్లు। చేసి లక్ష్మణ ముని మోక్ష
సిద్ధికొఱకు। శిష్యులకు నెల్ల యతిపతిఁ జేరుడనుచు। జెప్పెఁద దధీనుఁడా
సర్వ శేషి గనుక॥ ౬

తా॥ ఆత్మపరమాత్మల దుఃఖముల బోఁగొట్టి తండ్రిని గూర్చుని గూ
ర్చెడి తల్లివలెనుండెడి క్రమమానతిచ్చిరనియు సమస్త కర్మములు మొదలైన
యుపాయాంతరముల నడత లానతిచ్చియు సిద్ధ సాధనమైన నడతలను
నానతిచ్చిరనియుఁ బ్రపత్తిపరులైన ప్రపన్నుల నడతలును నట్టి వారిలోఁ నా

కని సంబంధము గలుగ వలెననియు శ్రియఃపతి కృపకు హెచ్చు తక్కువలు లేవు ఎందువలన ననఁగా శ్రేష్ఠమయిన కల్యాణగుణములు గల యాచార్య పూరుషున్న వనియు శ్రీ వచనభూషణ శాస్త్ర నిర్వాహకం బీలాగునఁ దెలిసి లక్ష్మణార్యులు బయల్కు చేసిరనియు మోక్షప్రాప్తికొఱకుఁ దమశిష్యుల నెల్ల నెంబెరుమానారును జేరుండని యానతిచ్చి సర్వ శేషిసైన శ్రియఃపతి యా యెంబెరుమానారుకు నధీనుఁడని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (పురుష కారోపాయ వైభవముల నానతిచ్చి శ్రియఃపతి యందఱి యందుండి వారి కోరికల నిచ్చునని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ అగ్ని పురోగములైన దేవతలందుఁ దా నుండి విప్రుల తలఁపు లిచ్చు । నష్టాంగ యోగ క్రియా భ్యాసమున మనో వాసిసైె తద్యోగ వాంఛ లిచ్చుఁ । బ్రత్యక్షగోచర ప్రతిమాదు లందుండి యప్ర బుద్ధుల కీప్సి తార్థమి చ్చు । సర్వత్ర తానుండి సంశయింపని బుధుల కెందం డె యుండి వారిష్ట మిచ్చు । విష్ణు గాయత్రి దర్శిత విష్ణువాసు । దేవ నారాయణాఖ్యుండు తెలివి కొలఁది । నందు సర్వాంత రాత్మైన యతనిఁ దెలిసి । నతఁడె ఘనుఁడని మా లక్ష్మణార్యులనిరి॥ ౭

తా॥ శ్రియఃపతి యగ్ని భగవానునియందుండి బ్రాహ్మణులు కోరిక లిచ్చుననియు నష్టాంగ యోగములు చేసెడు వారి చిత్తమందుండి వారి వాంఛ లిచ్చుననియుఁ బ్రత్యక్ష దేవతాంతరముల నుండి యప్ర బుద్ధులకు నీప్సితము లిచ్చుననియుఁ సకల వస్తువుల యందు నుండెడు నది సందేహము లేదనిన పెద్దలకు శ్రియఃపతి తా నందం డె యుండి వారి యిష్టము లిచ్చుననియు విష్ణు గాయత్రిచేతఁ జూడఁబడిన విష్ణువాసుదేవ నారాయణాయనెడు తిరునామము లుగల యతండె యితని తెలివి కొలంది యనియు నందులో సర్వాంతరాత్మ యయిన యతనిఁ దెలిసిన యతండె ఘనుండని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శ్రియఃపతి వారి వారిని రక్షించెడి విధమానతిచ్చి దేవతాంతరముల కన్నను శ్రియఃపతి దాస్య మధికమని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ ఇలదేవతల నెల్ల నెఱిఁగి కొల్చుట కన్న సర్వాంతరాత్మ పూజ నేమమేలు । చక్షుర గోచర స్వామిఁ గొల్చుటకన్నఁ బ్రత్యక్ష వైష్ణవ ప్రణుతి మేలు । అఖిల వైష్ణవజాల మవనిఁ గొల్చుట కన్న శ్రీభాష్య కారాంఘ్రి సేవ మేలు । ఆయతీంద్రుని మహిమ లరసి కొల్చుట కన్నఁ దద్భక్త కూరనా

ధాదిసుజన । సంగ వరవరయోగీంద్ర చరణయుగళ। సంతతధ్యాన పరిపూర్ణ
శమదమాది । యుక్త మానస లక్ష్మణ యోగితిలకు । కరుణ గలిగిన వారి
సంగతియె మేలు॥ ౮

తా॥ భూమిలో దేవతాంతరములను గొలుచుట కన్నను సర్వాంతరాత్మయైయున్న శ్రీయఃపతి సేవ మేలనియుఁ గన్నులకు గోచరించెడు నర్చావతార విగ్రహముల సేవకన్నను బ్రత్యక్షమైన వైష్ణవుల సేవ మేలనియు నఖిల వైష్ణవులకును దాను జేసెడు నుపచారముల కన్న నెంబెరుమానారు తిరువడిగళ నెఱిఁగి యుపచారములు సేయునది యధిక మఱియు నా యెంబెరుమానారు మహిమ లెఱిఁగి కొలుచుట కన్నను వారిదాసులైన కూరత్తాళ్ వారులు మొదలైన యాచార్య సంబంధము మేలనియు వారి సంబంధ వైభవ మెఱిఁగిన పెరియజీయరు తిరువడిగళెప్పుడును మఱువక మనస్సులో నుంచుకొని శమదమాది గుణములు పూర్ణముగాఁగలిగిన యెంబెరుమానారు జీయరానతిచ్చిరనియు వారి కృపగల వారి సంగతి మేలని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శ్రీయఃపతి కన్నను శ్రీవైష్ణవ మహిమలును స్వామి వైభవమును నానతిచ్చి శ్రీయఃపతి కృపతోఁ గూడిన సర్వ శక్తిత్వములను మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ కార్చిచ్చు కైయాల కాపర్లు మొరవెట్ట నునికె పట్టున వారి నునిచి
నట్లు । మధురలో వారు నెమ్మది నుండవలెనని చింతించ ద్వారకఁ జేర్చి నట్లు ।
సాకేత జంగమస్థావరంబులఁ దానుబోవుచు వెంటఁ గొనిపోయినట్లు। యిచ్చ
వచ్చినచోటి కెంబెరుమానారుఁ బ్రియములోఁ గొంపోయి పెట్టినట్లు । దివ్య
దేశస్థితాచర తిర్యగాది । జంతు జాలముఁ గొనిపోయి స్వామి గనుక । శ్రీని
వాసుండు స్థిర నిజ సీమఁ జేర్చి । దిద్దునని చెప్పె లక్ష్మణ దేశికుండు॥ ౯

తా॥ కార్చిచ్చురాఁగా గోపాలకులు తమ్ముఁ గావుమని కృష్ణుని గూర్చి మొరపెట్టఁగా నా కార్చిచ్చును జల్లార్చి యా గోపాలకుల నునికిపట్టున నునిచి నట్లును మథురలోనివారు నెమ్మదిగా నుండవలెనని చింతించఁగా నొక రాత్రి ద్వారక కావించి యా పట్టణ మందందఱిని జేర్చెననియు నయోధ్యా పురి యందున్న స్థావర జంగమాదులు మొదలైన యాత్మలను శ్రీరఘునాయకుఁడు తాను బరమ పదమునకు వేంచేయుచు వెంటఁ దోడ్కొనిపోయి నట్లనియు శ్రీ పురుషోత్తమమందున్న శ్రీజగన్నాయకుఁ డెంబెరుమానారును మనసు వచ్చిన దిక్కునకు నెత్తుకొనిపోయి పెట్టి నట్లనియు దివ్య దేశమందుండిన జంతు జాలములను గొనిపోయి స్వామి గనుక శ్రీయఃపతి నిత్యమైన పరమపదమునకుఁ జేర్చి

కైంకర్యమునకు దిద్దుకొనుమని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ ( దివ్య దేశవాసులైన యాత్మలను శ్రియఃపతి కడ తేర్చునని యానతిచ్చి ఫలసాధనముగా నుండ రాదని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ పురుషోత్తమత్వ సద్బుద్ధియుఁ దజ్జన్మ కర్మ దివ్యత్వ ప్రకార బోధ। తత్పుణ్య నామకీర్తనమును దద్దివ్య దేశ వాసంబును దినము నెదుట। దీపంబు వెట్టుట తిరుమాలె గట్టుట మొదలైనయివి మోక్షమునకుఁ దెరువు। లనుబుద్ధిగాక తానవిఫలంబుగఁజేసి కర్మ యోగాదీ సంగతులుమాని। ప్రాపకంబును బాహ్యంబు భగవదంఘ్రి। యుగ్మమునినమ్మి ద్వయ మర్థయుక్తముగను। నానతిచ్చిన గురువరు నండనెపుడు। నుండవలననె లక్ష్మణయోగివరుఁడు॥ ౧౦

తా॥ పురుషోత్తమ విద్యయును జన్మకర్మములై దివ్యమైయున్న దనుట మెఱుఁగు బోధయును నతని తిరునామ సంకీర్తనమును నతని దివ్యదేశవాసమును దీపంబుపెట్టుటయును దిరుమాలె గట్టుటయును నివిమొదలైనవి మోక్షమునకుఁ ద్రోవలని మనస్సుననుంచక తా నతనికిఁ జేసెడు నది తనకు వృత్తియని చేసి కర్మయోగాది సంగతులు మానవలెననియుఁ బాంధఁబడఁ జేయునదియుఁ బొందించెడునదియు శ్రియఃపతి తిరువడిఘళ్ళనమ్మి ద్వయముయొక్క యర్థముతోఁ గూడియు నీయర్థములానతిచ్చి రక్షించిన గురువరుండైన యాచార్యునియొద్ద నుండవలెనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( పాఠనాంతరములఁగూడి ప్రపత్తిచేయరాదనియానతిచ్చి కొమారుండును భార్యయును దాసుండును శ్రియఃపతికి నిట్టి సంబంధములు గలవని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఔపాధికంబైన యాత్మజుండును భార్య దాసుండు నిచట నిర్ధనికులరయి। వీరు సంపాదించు వివిధ ధనంబును వీరి సేలిన వారివి త్తమిదియు। నైనచోనిరుపాధి కాత్మేశ్వరుని దాసులకీలాత్మలును దప్పదనియెఱింగి। యాత్మార్పణముఁ జేసి యాత్మీయములనిచ్చి యూరకుండిన యతండుత్తముండు। వెనుక యేలిక చెప్పిన వివిధదాస్య। కృత్యములఁజేసి తాఁ గృతకృత్యుఁ డగుచు। నతని సంతోష పెట్టిన యతఁడె ధన్యుఁ। డనుచు లక్ష్మణమునివరుం డానతిచ్చు॥ ౧౧

తా॥ శ్రియఃపతికే నీయాత్మ కొమారుండును భార్యయును దాసుఁడును నన్నియుండు గనుక వారుదరిద్రులనియు వీరార్జించెడి ద్రవ్యములును వీరిముగ్గురికిని గర్తయైన వారిదనియు నయినచోట నిరుపాధి కాత్మేశ్వరుండైన

శ్రియఃపతి దాసులు సమస్తాత్మలును దప్పదని యెఱింగి యుండవలెననియుం దమ యాత్మను సమర్పణముచేసి యాత్మీయములైన మనోబుద్ధులను సమర్పించి యహంకారకుండిన యతం డుత్తముండనియు వెనుక మేలిక చెప్పిన విధమున దాస్య కృత్యములు చేసి తాను కృతకృత్యుండై యతని సంతోష పెట్టిన యతండె ధన్యుం డనుచు లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( శ్రియఃపతికి యాత్మలు దాసులు గనుక తామే కడతేరుదురని యానతిచ్చి దేవమనుష్యాది దేహంబులు పంచ భూతాత్మ యని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ దేవ మనుష్యాది దేహంబు లంటిమా పంచ భూతైక్య సంభవములనియు। దేహభోగంబులఁ దృప్తి గద్దంటిమా పృథుతరంబై యాశ పెరుగుననియు। దేహస్థిరత్వంబు తెలిసెదమంటిమా నీరుబుగ్గకుఁగల నిలుకడనియు। దేహంబులోపలఁ దెలిసెదమంటిమా చెప్పినఁ గుక్క లాసించదనియుఁ। దెలిసియుందాకమాని తద్దేహినైన। యాత్మ సుఖరూప కైవల్యమల్పమనియుఁ। దెలిసి యానంద మయుఁడైన దేవుఁ జేర। మంచిదని చెప్పె లక్ష్మణ మౌనివరుఁడు॥ ౧౨

తా॥ దేవతిర్యఙ్మనుష్య స్థావర జంగమాదులైన యాత్మలకు శరీరములు విచారించినఁ బంచభూతము లొకటిగాఁగూడి సంభవించెననియు నట్టిశరీరములనుగూడి భోగించవలెనను నాశకుఁదృప్తి గలదంటిమా క్రొత్త క్రొత్తలుగా నాశ పెరుగుననియు దేహమునికి తెలిసెద మంటిమా నీరుబుగ్గకుఁగల నిలుకడయనియు దేహములోపలఁ జెప్పెద మంటిమా చెప్పెదు నప్పుడాపురికిని వినినఁ గుక్కలకుఁగూడ నాశ పుట్టవనియు దేహము కట్టడ కని వినిన నందలి యాశ మాని యాత్మ కైవల్య సుఖ మల్పమనియుఁ దెలిసి యానంద మయుండైన శ్రియఃపతిని దెలియ వలెనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( దేహవికారము లానతిచ్చి వివరమైన జ్ఞానము లేకుండెనేని హానియని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ దేహాత్మలకు వేఱు తెలియ నేరని హాని యాయాత్మ దాజ్ఞాతననినహాని। యతఁడన్యులకు శేష మనితలంచినహాని యచ్యుత పరతంత్రుఁ డనినహాని। పరతంత్రుఁడై స్వామి పనులు సేయని హాని యవిచేసి తా భోక్తననినహాని। యుక్తదాస్యము తదీయులకుఁ జేయనిహాని యాచార్యుఁ డే దైవమనిన హాని। యన్నిహానులు వోఁజేసి యనవరతము। తన్నునెప్పుడు మఱువక తలఁచఁ జేసె। సౌమ్యజామాతృ యతిరాజ శఠజిదీశ। మూర్తిఁ గాంచోలు లక్ష్మణ మునివరుండు॥ ౧౩

తా॥ దేహమును నాత్మయును వేఱువేఱని యెఱుఁగ నేరనిది హానియని యు నాయాత్మ యన్యులకు శేషమని తలంచిన హానియనియు నాయాత్మ శ్రీయఃపతికేఁ బరతంత్రుఁడై యుండిన హానియనియుఁ బరతంత్రుఁడై మే లినవాని పనులుచేయనిది హానియనియు నాపనులుచేసి తాను జేయఁగా నా మే ననెడి తలంపు హానియనియు యోగ్యమైన దాస్యము శ్రీవైష్ణవులకుఁ జే యనిది హానియనియు నాచార్యుఁడే దైవమనదిది హానియనియు నన్నిహానులు పోఁజేసి యనవరతమును దన్ను నెప్పుడు మఱువక తలఁచఁజేసిన యాచార్యుం డు పెరియజీయ రెంబెరుమానారు నమ్మాళ్వారులు శ్రీయఃపతి వీరి లోపల నా యాచార్యుం డొక మూర్తి కాఁబోలునని లక్ష్మణార్య లానతిచ్చిరి॥ ( విశేష జ్ఞానములేక యుండెనేని హానియనియానతిచ్చి రఘునాయకులు వానర సేనను గాపాడినట్లు శ్రీయఃపతి యీ సకలాత్మలను గాపాడునని మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ ॥ సుప్తవానర సేన చుట్టును దిరుగుచుఁ గాచు రామని రీతిఁగా చు శ్రీశుఁ । డామాయచే సుప్తులైన బద్ధాత్మల నిరతంబు విసువక నిద్రలేక । శ్రీ గుహప్పెరుమాళ్ళ సేనయు లక్ష్మణానంతరులై సుప్తవాధుచుట్టుఁ । దిరు గుచుఁ గాచిన తీరున నిత్యులుముక్తులు లక్ష్మిశుభక్తి నెపుడు । నొకరినొకరిని నమ్మకయు రఘుబురఘు! లనుచు నెప్పుడుగాతు రట్లాటఁ జేసి । స్వామి కెప్పుడు మంగళాశాసనంబె । తెలిపి చేయించు లక్ష్మణ దేశికుండు॥ ౧౪

తా॥ వానర సేనలు నిద్రవోవఁగా విరోధముఁ గలుగకుండ రఘునాయకుండు గాచినట్లనియు శ్రీయఃపతి తనమాయచేత సకలాత్మలను గాచుననియు నా మాయచేత నిద్రవోయిన బద్ధాత్మలను దాను వేసట లేక నిద్రలేక శ్రీయఃపతి కాపాడుననియు శ్రీ గుహప్పెరుమాళ్ళను సేనలును లక్ష్మణ పెరుమాళ్లును లోనుగాగలవారు పెరుమాళ్లు సుఖ నిద్ర వోవంగా జుట్టు దిరుగుచు గాచిన రీతి నిత్యులును ముక్తులును భక్తులును శ్రీయఃపతినెప్పుడును నొకరినొకరు నమ్మక యు రఘుబుతా మనుచుఁ గాతురట్లగుటం జేసి స్వామికెప్పుడును మంగళాశా సనమే చేయుమని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( శ్రీయఃపతికెప్పుడును మంగళా శాసనముఁ జేయుమని యానతిచ్చి సర్వాధికుండైన శ్రీయఃపతి దాసునివంటి నీచుని రక్షించెడు విధము మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ పంచేగాఁ డొకచోట బాతిమాలిన గవ్వ నుత్తమధనమునకొడ్డుఁ జే యుఁ గొగర్తైనవాఁడు దాఁగాముకుఁడై వాసినొక వేళఁ బిలిచి కూడుండఁ జూ

చు । మండలేశుఁడుదాను మన్నించి హేయశ్వ పచునైన రాజ్యార్థి పతిని జే
యు । వాదవిద్యాశాలివలచిన నినుమైన బంగారముగఁ జేసి పసలఁగొనను । న
ట్లసర్వాధికుండైన యచ్యుతుండె । నీచున్న నిట్లురక్షించుఁ జూచితావె । లక్ష్మ
ణాచార్యుఁడై పుట్టెలక్ష్మిఁగూడి । రాజుఁజేయను వను నివారకలు లేరు॥ ౧౫

తా॥ పంచములాడెదు జూదగాఁడు చాతిమాలిన గవ్వఁ దెచ్చి యుత్త
మధనముగఁ జేయుననియుఁ గర్తమైన రాజ్యకాంక్షిఁ గాముకుండై తనచా
సిని బిలిచి కూడియుండఁ జూచుననియు రాజ్యమేలెడి మండలేశ్వరుఁడు హే
యుండైనశ్వపచుని దన రాజ్యమునకు రాజుగా జేయుననియు రసవాదకాఁ
డుస్పర్శవేదియను నౌషధము చేత నినుము బంగారముగాఁ జేసి పసలఁగొను
ననియు నటువలె సర్వాధికుండైన శ్రియఃపతి నీచుఁడనైన దాసుని రక్షింపఁ
జూచి తామే లక్ష్మణార్యులై వచ్చి లక్ష్మిఁగూడి తాత్పర్యము లానతిచ్చి రనియు
రాజుచేయఁబూనిన కార్యమును వలదను వారు లేరని లక్ష్మణార్యులానతిచ్చి
రి॥ ( ఘనమైన వాఁడల్పునిఁ జేపట్టెనేని కడతేరునని యానతిచ్చి యీ యాత్మ
శ్రియఃపతికే బట్టువడిన విధము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ తమ భక్తి మునులాత్మఁ దనుఁగట్టఁ దలఁచిన నప్పుడెవ్వఁడు దాఁ
గునతండుదానె । యబలయొకర్తె దన్ను నాకత్రాటను గట్ట దామోదరుం
డనఁ దనరెనతని। సృష్ట్యవతారాది చేష్టలకొదుగక నేర్పునకొసరుననేనె వె
నుక । చలమున నాతఁ డాచార్యుఁడైవచ్చిన భావంబు దెలియక పట్టువడితి।
ననుటని ద్దరిదుస్వతంత్ర కృతులను। దలఁపు దలఁపులు దప్పించి తనకు వశము ।
చేసుకొనికూర్చునిద్దరి శ్రీశుకరుణ। నతిశయించినదని లక్ష్మణార్యులనిరి॥ ౧౬

తా॥ అష్టాంగ యోగాభ్యాస పరులు తమలో నంతర్యామిగాయున్న
శ్రియఃపతి నిఁక నేమని శరీరములో వెదకనేని దాఁగెడు వాఁ డెవ్వఁడో
యతండెయనియు నట్టి వాఁడె యొకయాఁడుది దూడత్రాటం గట్టినఁ గట్టుపడె
ననియు నదిమొదలు దామోదరుండను తిరునామము గలిగెననియు నీసృష్టిలో
నవతారాదులకు లొదుగక యాత్మలు చెడఁగా నాచార్యుండై వచ్చిన వారి
హృదయ మెఱుఁగక దాసుఁడు పట్టుపడితిననియు నగుట నిద్దరి స్వతంత్రము
లనుదలంచిన తలంపులును దప్పించితిరనియు శ్రియఃపతి కృపచేత నాచార్యుని
శిష్యుని నతిశయించి కూర్చెనని లక్ష్మణార్య లానతిచ్చిరి॥ ( శ్రియఃపతి
యవతారములకుఁదగులని యాత్మలను నాచార్యుని శిష్యుని జేర్చి సర్వేశ్వరుని
గూర్చిరని యానతిచ్చి యీయాత్మలఁ బట్టుటకుం గరణ కళేబరముల నిచ్చె

నని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ సర్వేశ్వరుండు సర్వశక్తిని నాత్మలఁ బట్టగరణ కళేబరములి చ్చి। సన్మార్గవర్తి గా సచ్ఛాస్త్రమిచ్చియు బహుభంగిబుట్టియుఁ బట్టలేక। పదుగురాళ్వారులఁ బనివడఁబుట్టి గపనందుకు వేదప్పినదియుఁ జూచి। యింకఁ జూడుమాయని యెంబెరుమానారుఁబంపిన నతనికిఁ బట్టువడితి। నతఁడు ననుఁ బట్టెనుమూఁడు జన్మాంతరములఁ। దనకువరవరమునినైయెనదనకుఁదప్పి। దాఁగి పోవంగ వెనువెంటఁ దగిలితానె కడనులక్ష్మణముని వరాకారుండగుచు॥ ౧౭

తా॥ సర్వేశ్వరుండైన శ్రియఃపతి సర్వశక్తిచేత నీయాత్మలకుఁ గరణ కళేబరముల నిచ్చెననియు సన్మార్గమున నడిచితమ్మఁ జేరవలెనని శాస్త్రములనిచ్చినవవిచదివి నడువలేక చెడిపోఁగాఁ దామె దశావతారములెత్తి పట్టఁబోఁగాఁ దగులకుండఁగాఁ బదుగురాళ్వారులఁ బుట్టించిన వారికిని దాసుఁడు చిక్కకతప్పినది చూచి యింకఁ జూడుమాయని యెంబెరుమానారు పట్టఁగా నతనికిఁ బట్టువడితి ననియు నాయెంబెరుమానారు మూఁడు జన్మాంతరములను దాసుని బట్టెననియు రెండవజన్మమునఁ బెరియజీయరై రక్షించుమన దాఁగిపోవఁగా వెనువెంటఁదగిలి తామె మఱియొక జన్మమందు లక్ష్మణముని యవతారమై రక్షించిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఎంబెరుమానారీయాత్మను మూఁడు జన్మాంతరములను వెనుదగిలి రక్షించిరని యానతిచ్చి పరమాత్మను నెఱుఁగక యీయాత్మ బందెపసరమువలెఁ దిరుగఁగా శ్రియఃపతి కాపాడిరక్షించునని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ పరమాత్మనే బందెపసరమునై భూమిఁ బరచి మేయఁగ నన్నుఁ బట్టదలఁచి। మెడనొక గుదెగట్టి మేయఁ దోలినరీతిఁ దరముగా నన్య సాధనముఁజూప। దానిచేనొచ్చి మేఁతయుఁగానకుండఁగా లక్ష్మణార్యులతోడ లంకె వెట్టి। బెదరకుండను దాసబృందంబు చేరఁదోలి యతిరాజవృషభసంగతినిమలపి। పాయకుండంగఁ దానె గోపాలుఁడగుచు। మేతయును బెట్టి రక్షించి మేనుని మిరి। ఫలముమీఁదాశ నున్నాడు పాయకతని। దాసబృందంబులోనె నెందుఁ దగిలి యుందు॥ ౧౮

తా॥ పరమాత్మయైన శ్రియఃపతిని నెఱుంగక దాసుఁడు బందెపసరమునైనా నాదికర్మలఁ బరచి మేయఁగా నట్టియావునుబట్టి గుణములు ఘట్టించి ఫలమనుభవింతునని పరమాత్మయైన శ్రియఃపతి యాయావుమెడ నొక గుదియ గట్టి మేయఁదోలినరీతిఁ దరముగా నన్యసాధనముల మరగెననియు నందుచేతఁ

జాలవొచ్చి మేంత మేయుక నొప్పిచేత నుండఁగా నామెడ గుదియ విడిపించి లక్ష్మణార్యులైన సదాచార్యునితోడ లంకె వెట్టెననియు జెదరకుండఁగ దాస బృందంబు నందుఁ జేరఁదోలి కాపాడె ననియు నంతట నెంబెరుమానా రనిమెడి వృషభముయొక్క సంగతి గలిగె ననియుఁ బాయకుండను దానే గోపాలుండై మేఁతయుఁబెట్టి మేను దడివి రక్షించెననియు నాయావీనిఁ గదా ఫలమున్నట్లె యెప్పుడీ నుపాయని మనస్సునఁ దలంచు చుండఁగా ఫలిం చెననియు నతని దాసులలోనే తగిలి యుండవలెనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( బంటెపసరమైన దాసుని శ్రీయఃపతి రక్షించెనని యానతిచ్చి శ్రీయఃపతి తను వివాహ నిమిత్తము నేనను పిన్నపసుచును వివాహమాయె నని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ వాసు దేవుఁడు తన వివాహార్థమై నేను బడుచునై యుండఁగ బాల్యమందు । నా మీఁదఁ గనువేసి నన్ను సమ్మతిపెట్టి యడిగించఁ దనవారి నంపి నపుడు । తలిదండ్రులకీయఁ దలఁపుండఁగాఁ జేర నపుమంత్ర పద్యాలు నన్ను నీను । వద్దని చెప్పఁగా వారి కెల్లను బెద్ద మనసు సమ్మతిపడ్డ మాత్ర మందె । తండ్రి లక్ష్మణమునియును దల్లినైన । విద్యయునుసిచ్చిరిఁకఁ బదివే లుగూడి । మాన్పఁజూచినఁ బోనీఁడు మాధవుండు। తానె కొనిపోయి భోగిం చఁ దలఁచుఁ గాని॥ ౧౯

తా। శ్రియఃపతి తన వివాహ నిమిత్తమై దాసుని బాల్యమందె పడుచు నై యుండఁగా నామీఁదఁగనువేసి నన్ను సమ్మతిపెట్టి తనవారైన పెద్దల నంపి నప్పుడు తల్లి దండ్రులకు వీరికె యిచ్చుటకుఁ దలంపు గలిగి యుండఁగాఁ జేర కాండ్రైన నడమఁ గూడిన యార్యులు నన్నుఁ జేరి నీవాతఃని వివాహముకావ లదని చెప్పఁగా వారికెల్ల మనస్సు సమ్మతి పలచిన మాత్రమందే తండ్రి లక్ష్మ ణమునియుఁ దల్లినైన విద్యయును నిచ్చిరి యింకఁ బదివేల జనముగూడి మా న్పినను నతండు పోనీఁడు తానె కొనిపోయి భోగించఁ దలంచునని లక్ష్మణా ర్యులానతిచ్చిరి ॥ ( ఈయాత్మను భర్తృభార్య సంబంధముచేత రక్షించవ లెనని శ్రియఃపతి వివాహమై కడతేర్చునని యానతిచ్చి సర్వేశ్వరుండు కృషి కర్తయాయెనని మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ ॥ కవచకుండైరమా కాంతుఁడు దలఁపను నా గేటఁ బెనుపాపు నాడుదున్ని । యాత్మసస్యము నాటి యందులోఁ గలుపేరి చల్లఁగానిజగుణజ లముగట్టి । యుండఁ బాయకలక్ష్మణార్యులై కాఁపుండి తోడకులుచోరకం

డందోలఁగఁదోలి । పండినచోటఁ దత్పరతతో నాడించి స్థూలదేహపుటు
ముకతోడఁబాపి । యర్చిరాదుల తలకెత్తి యాత్మనిలయ । వేద్యవైకుంఠ
సీమాంత విరజలోన । సూక్ష్మదేహపుతవుడూడ శోధజేసి । పక్వమొనరించి
భుజియించెఁబద్మఁ గూడి॥ ౨౦

తా॥ శ్రియఃపతి పంతకాపై పెనుపాడైన మిట్టను నాఁగేటనిక్కిలిలోఁ
తుగాదున్ని పాదుపఱచె ననియు నాత్మయనెడి సస్యము నాటినాఁడనియు
దుస్సంగతులనెడు కలుపుదీసి చల్లఁగాఁ దనగుణములనెడి జలముగట్టినమీఁద
నాత్మగుణములచేతఁ బైరుపెరిగి రాఁగా లక్ష్మణాచార్యులు కావలియుండిరని
యు దొంగపసులువచ్చి మేయకుండఁదోలఁగఁ దోలిరనియు నీలాగునఁ గా
పాడఁగానక్కడక్కడఁ బండెననియుఁ బండినచో సస్యములను బ్రియముతో
డఁగోయించి నులిచి ధాన్యము కూడినవెనుక స్థూలదేహమనెడి పొట్టునుము
కఁబోఁగొట్టినబియ్యపు ఘనమైననియు నాబియ్యపు నర్చిరాదులైన యాదివా
హకులనెత్తిమీఁదికెత్తి తనకు స్థానమైన పరమపదసమీపమున విరజానదిలో
సూక్ష్మదేహపుతవుడూడఁ దీర్ఘమాడించి పెరియపెరాట్టి పక్వముసేయఁగా
శ్రియఃపతి యారగించిరని లక్ష్మణాచార్యులానతిచ్చిరి ॥ ( సర్వేశ్వరుండైనశ్రీ
యఃపతికృషికర్తయైన పంటఁపెట్టి నిజస్థానమందుఁ జేర్చి శ్రీదేవినిగూడిభోగ
మనుభవించునని యానతిచ్చి యీయాత్మశ్రియఃపతికి నాత్మకమనియెఱిఁ
గెడివిధముమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ త్రిగుణాత్మక క్రియాధీన చేతనులను సుఖదుఃఖ హేతు వస్తువులు
జగతి । హేతుంబులైయుపాదేయంబులైతోఁచు కర్మానుగుణదేశ కాల
ములను । భావించియందున బ్రహ్మాత్మకంబైన వస్తువులేదను వారికివియె । దృ
ఢభక్తిచే నుపాదేయమయ్యేతోఁచు భయహర బ్రహ్మ సంబంధమునసై । నతని
కధిమతదివ్య నిత్యానవద్య । విగ్రహాసక్తులై వారె వెరవులేక । యనుభవిం
తురు ముక్తులైనపుడు దీని । నాదరంబున నని లక్ష్మణాచార్యులనిరి॥ ౨౧

తా॥ సాత్త్వికరాజస తామసములైన మూఁడు గుణములనుగూడి యాగు
ణములకు నధీనులైయున్న చేతనులకు సుఖదుఃఖములనుభవించ హేతువులైన
వస్తువు లీలోకములో సుఖదుఃఖ రూపములై యుండుననితోఁచు కర్మమునకు
ననుగుణముగా దేశములందును గాలములందుననుభవింపఁజేయుననియు నివి
చూచియందువలన బ్రహ్మాత్మకమైన వస్తువులేదని యెఱిఁగిన వారికెప్పుడును
దృఢమైన భక్తిచేత సుఖమయ్యేతోఁచు ననియు శ్రియఃపతికి నీయాత్మలాత్మక

మని యెఱిఁగి యుండవలెననియు నిట్టివారికి నిష్టమైన వస్తువు దివ్యమై నిత్యమై యనవద్యమైయున్న విగ్రహమందాసక్తులై యుందు రనియు నతని యనుమతిచేత నాళ్వార్ వీరి ముక్తులై పోయి యావిగ్రహానుభవ మాదరంబునఁ జేతు రని లక్ష్మణాచార్యులానతిచ్చిరి॥ (శ్రియఃపతికి నీసర్వమైనయాత్మలును నాత్మకమని యెఱిఁగి యుండవలెనని యానతిచ్చి తోడుఁ జూడఁ గూడఁ బాడఁగల వారుగలిగిన మేలని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ తోడుమేలని వచ్చి దుఃఖనివర్తకాచార్యు నిచ్చటఁ జూప శక్తులైనఁ। జూడమేలనవచ్చు శుద్ధ స్వభావుఁడై యాత్మేశ్వరులఁగూర్చు నాప్తుఁడైనఁ। గూడమేలనవచ్చుఁ గొదువ లన్నియునోర్చి శుద్ధుఁజేసెడి పరంజ్యోతిమైనఁ। బాడమేలనవచ్చు బహుసుఖ ప్రదుఁడునై నిత్య ముక్తులఁ జేర్చు నిపుణుఁడైన। ననుచుఁ దోడైన వైష్ణవులరసిచూప। నార్తిఁదాఁ జేరి యాచార్యునలవుఁజూచి। కోర్చుకొని పాడఁజేయుఁ ముకుందుఁజేరి। యుండవలెనని లక్ష్మణ యోగివరుఁడు॥ ౨౨

తా॥ సంసార దుఃఖమును బోఁగొట్టబడిన యాచార్యుని తిరుగఁడఁజూప శక్తులుగల మహాత్ములను దోడు గూడునది మేలనియు నాత్మను బరమాత్మనుగూర్చ నాప్తుండై శుద్ధస్వభావముగల మహాత్ములను జూడమేలనియు దాసుని కొదవలోర్చుకొని పరిశుద్ధునిఁ జేసెడు పరంజ్యోతి స్వరూపుండైన వానిని గూడమేలనవచ్చు ననియు బహుళమైన సుఖమును నిచ్చెడి పరమపదమందు నిత్య ముక్తులఁ జేర్చ నేర్పరినైన వారినిఁ బాడ మేలనియు ననుచుఁ దనకుఁ దోడైన వైష్ణవులఁగూడి యెఱిఁగిచూప నార్తిగలిగి తాను జేరి యాచార్యుని నిలుకడచూచి కూర్చుకొని పాడఁజేయు శ్రియఃపతిని జేరి యుండునది మంచిదని లక్ష్మణాచార్యు లానతిచ్చిరి॥

గద్య॥ ఇది ముముక్షుజనకల్పకంబను మహా ప్రబంధంబు నందుఁ బరగత స్వీకారంబు బయలుపడ నిర్హేతుకంబుగా నాచార్యు లంగీకరించిన ప్రకారంబును నాత్మేశ్వర సంబంధద్యోతక పూర్వకంబుగా రహస్య త్రితయార్థ తాత్పర్య వర్ణనంబును శ్రీవచనభూషణార్థ తాత్పర్యంబును నుపదేశార్థ గౌరవ ప్రకారంబును సర్వాంతరాత్మయైన సర్వేశ్వరుం డధికారాను గుణంబుగా ఫలంబు లిచ్చెడు ప్రకారంబును దేవతాంతరోపాసనాద్యుత్తరోత్తర సమీచీన ప్రకారంబును దివ్యదేశవాస స్థావర జంగమోద్ధరణ ప్రకారంబును బుధాస్వరూపేణ త్యాజ్యోపాయాంతర వర్ణనం

బును నాత్మాత్మీయ సమర్పణ ప్రకారంబును శేషస్వరూపాది వర్ణనపు
రస్సరంబుగా నానందమయ పారిప్యత్వ సమీచీన ప్రకారంబును పూర్వప
రంపరల స్వాచార్యుండు బోధజేసిన ప్రకారంబును రక్ష్యరక్షకత్వ స్వరూ
పాత్మేశ్వరులయొక్క రక్ష్య రక్షకభావ వినిమయ ప్రకారంబును భగవ
న్నిర్హేతు కాంగీకారమై విధ్యంబును దదీయా కారంబుతోఁజిన జ్ఞానాది
కులకు లీలావిభూతి నుపాదేయం బనుటయును శ్రీ వైష్ణవా చార్యేశ్వర ప్ర
కారంబునన్నది సప్తమ ప్రకరణము॥

అచ్యుత శఠకోప యతిరాజ వరవర నిజగురుభ్యోనమః.



శ్రీమతేరామానుజాయనమః.

ము ము క్షు జ న క ల్ప క ము.

అష్టమ ప్రకరణము.



పరిశుద్ధాత్ములయిన మహాత్ముల కూటమి మంచిదని యానతిచ్చి
శ్రియఃపతి దాసులైన శ్రీ వైష్ణవుల వైభవము మీఁద నానతిచ్చు
చున్నారు॥

సీ॥ సకల దుష్కృ ద్వినాశన పూర్వ కాత్మీయ సాధు పరిత్రాణ సా
ధనముగ । సంకల్పి తేచ్ఛాను సారి మనోహర దేహులై సురనర తిర్యగా
ది । జాతులం దుదయించి జాత్యనురూపతద్గుణ వృత్తములయందుఁ గొదు
వలేని । దేవాదిదేవ తదీ యావతారంబులందుల వైభవం బరసిచూచి । తెలిసి
తద్గతగుణము పాదేయమైనఁ । తద్గతంబైన దోషంబు దానిగాఁగ్ల । తనకుపా
దేయమనుసిద్ధి ధార్మికులకు । మోక్షమనిచెప్పె లక్ష్మణ మునివరుండు॥ ౧

తా॥ పూర్వమందుఁ జేసిన మహాపాపములు నాశనము సేయను శ్రియః
పతి తమ కాప్తులైన సాధువుల రక్షించను దమ సంకల్పము చేతఁ దమకిష్టమై
నట్టి తిరుమేను గలవాఁడౌననియు నాయా తిరుమేనుల దేవతలును మనుష్యులు
ను దిర్యక్కులును స్థావరములును జంగమాదులును నివిమొదలైన జాతులందు
శ్రియఃపతి యవతారము లాయెననియు నాయా యవతారములకు ననురూప
మైన గుణములను నడతలను గొదువలెంచక యువిషరమమైన వేదాంతములా

మెననియు దేవాదిదేవుఁడైన శ్రియఃపతి వైభవ మిటువలెనుండఁగాఁ దదీయులైన శ్రీవైష్ణవుల యవతారాదులను వారి వైభవములను జక్కఁగాఁజూచి తెలిసి శ్రియఃపతి గుణములు సకలాత్మలకు నుద్దేశ్యమై కావలసియున్నట్టె యీశ్రీవైష్ణవ గుణములు సకలాత్మలకు నుద్దేశ్యమై కావలసి యుండుననియు నామహానుభావులగుణములే మాకు నుపాయమనియుండెడు పెద్దలకు మోక్షము గలదని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ (శ్రియఃపతి వైభవమువలెనే శ్రీవైష్ణవ వైభవము లనుభవించెడు పెద్దలు ప్రాప్యమొందుదురని యానతిచ్చి దొడ్డజాతులయందవతారమైన శ్రీవైష్ణవ సంబంధముమీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ ఉత్కృష్ట జన్మ సముద్భవులై విష్ణు సంబంధులై విలక్షణులు
నైన । వైష్ణవదాసాను వర్తనంబునఁ జెడు నపకృష్టజన్మ సంగాదిదోష । మ
నుచుఁ దదీయులై యమరుమహాత్ముల కనురూపదాస్యమం దధికరించి । విని
యోగపడ నినుము వేదకస్పర్శవేదిమా రీతిని జాతిదోష । మాక్షణంబునఁ
బోయి యచ్యుతానుగ్రహ పాత్రులౌదురు తత్ప్రభావమునను । నని వివే
కించి శ్రీవైష్ణవాపచార । మాత్మకరణ త్రయంబున నంటకుండ । భయము
భక్తియుఁగలిగినఁ బరమపదముఁ । గోరవలదనె లక్ష్మణ గురువరుండు॥ ౨

తా॥ దొడ్డజాతులయందవతరించి విష్ణు సంబంధులై విలక్షణులై యుండెడి శ్రీవైష్ణవుల దాస్యమందలి యనువర్తనచేతఁ గొంచెపు జాతిపుట్టిన జన్మసంగాదీ దోషములు చెడుననియు శ్రీ వైష్ణవులై యమరిన మహాత్ములకు ననురూపమైన దాస్యమందధికరించి పెద్దలకు యోగ్యమైన గుణములతోడం గూడిన శ్రీ వైష్ణవులు పావనులనియు స్పర్శవేదిచేత నినుము బంగారమైనట్లు జాతిదోషమాక్షణంబున బోయి శ్రియఃపతి యను గ్రహమునకుఁ బాత్రులౌదురు వారిప్రభావము లట్టివని వివేకించి శ్రీ వైష్ణవుల యపచారము మనస్సువాక్కాయముల నంటకుండను శ్రీవైష్ణవులయందు భయమును భక్తియుఁగలిగి యుండెనేని పరమపదముఁ గోరవలదని మా లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (దొడ్డజాతుల యవతారమైన శ్రీవైష్ణవదాస్యమునకు నపకర్షమైన కొంచెపు జాతుల దోషములు పోవునని యానతిచ్చి సంసారమందజ్ఞానమునఁ బడియుండిన వారిని నాచార్యుంజేర్చి శ్రీ వైష్ణవులు రక్షింతురని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ అజ్ఞులై సంసారమందుఁ దాను న్నప్పు డాచార్యుఁ జేర్చును
మహాత్ములనియు । నాచార్య సంబంధ మదియొకటియుఁ జూచి తనుగూర్చు

కొను మహోదారులనియుఁ । దాపత్రయజ్ఞాని తను నంటకుండఁ బరస్పర
బోధకారణములనియుఁ । బ్రాప్యభూమికిఁ బోయి పరుఁజేరు నప్పుడా పరు
నితోఁ గూడనె ప్రాప్యులనియు । నెఱిఁగి శ్రీవైష్ణవులు తమ యింటివారు।
లుందు రెటువలె దమయింట నుండుఁ దాను । దనదియునుబోయి తత్పరతం
త్రుఁడగుచు । నుండవలెననె లక్ష్మణయోగివరుఁడు॥ ౩

తా॥ అజ్ఞానముచేత సంసార మందుండఁగా శ్రీవైష్ణవులు బద్ధుని నా
చార్యుని జేర్చిన మహాత్ములనియు నాచార్యుని సంబంధ మొకటే పట్టిత
న్నుఁ గూర్చుకొను మహోదారులనియు సంసార దుఃఖము లీయాత్మను
నంటకుండఁ బరస్పరముగా బోధచేసి రక్షించు కారణభూతులనియుఁ బ్రా
ప్యభూమియైన పరమ పదమందుఁ జేరినప్పుడా పరమపద రాజులకు ముందు
గా వీరెయాదరించి పరవాసుదేవుల సన్నిధినిం జేర్తురనియు నీతీరున శ్రీవైష్ణ
వుల నెఱిఁగి తనయింటి వారెటువలె నరమరలేక యుందురో యటువలెనే
శ్రీవైష్ణవుల పట్ల నరమరలేక యుండవలెననియు దాను దనదియను నది పోయి
వారి పట్ల బరతంత్రుఁడై యుండవలెనని లక్ష్మణాచార్యులానతిచ్చిరి॥ (శ్రీ
వైష్ణవులయెడ సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును నరమర లేక యుం
డవలెనని యానతిచ్చి శ్రీవైష్ణవజాతులు పోయినప్పుడే పరిశుద్ధులౌదురని
మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ భ్రమరంబు చేఁ గీట భావమప్పుడె చెడి పురుగు తుమ్మెదగా
నుభాసఁగు నెఱిఁగి । స్పర్శంబుచేలోహ భావమప్పుడె చెడి యినుము బంగా
రమై మెసఁగు నెఱిఁగి । యగ్నిచేస్వర్ణ సక్తాఖిల దోషంబులప్పుడే చెడి మేలి
మగుట యెఱిఁగి । క్షత్రియత్వము తపస్సామర్థ్యమునఁ జెడి యతఁ డప్పుడే
విప్రుఁడౌట యెఱిఁగి । శ్వపచుఁడైనను విష్ణు సంశ్రయము వలన । నాక్షణం
బునఁ బరిశుద్ధుఁడౌను నతఁడె । యధికుడనియును నదిలేని యతియు నధముఁ
డనియు లక్ష్మణ మునివరుం డానతిచ్చు॥ ౪

తా॥ తుమ్మెద కీటకముయొక్క భావమప్పుడ చెరిచి యా పురుగను
దుమ్మెనగాఁ జేసెననియు స్పర్శవేదిచేత నినుము రూపము పోఁగొట్టి బంగా
రము చేసెననియు అగ్నిచేత బంగారములోఁగూడిన కల్మషములను బోఁగొట్టి
యప్పుడే మేలిమిగాఁ జేసెననియు రాచ జన్మను తపస్సామర్థ్యముచేఁ జెడి
యప్పుడే బ్రాహ్మణుఁడాయెననియు విశ్వపచుఁడైనను విష్ణు సంబంధము చేత
నాక్షణమునఁ బరిశుద్ధుఁ డౌననియు నాతండె యధికుం డనియు నా విష్ణు

సంబంధము లేని యతీశ్వరుఁడైన నధము తానని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శ్రీవైష్ణవజాతులు పోయి యాచార్య సంబంధముచేత నప్పుడే పరిశుద్ధులై రని యానతిచ్చి పూర్వులు తమ దొడ్డ జాతుల పుట్టువులు కారాదని యవతార విశేషములయందుఁ గూడి యాడి యుండెడి, కొంచెపు జాతులైనను దమకు లేకపోయెనని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ కృష్ణావతార సత్కృత గోప గోపీ స్వభావాను కృతి విభ్రమభావ మెఱిఁగి। దివ్య దేశోద్భూత తిర్యగాదిస్థితిఁ గావలెను రాజ కాంక్ష దెలిసి। వైష్ణవాలయ నిత్య వాస కీటావస్థ గోరు సదాచార్య కోర్కెఁ బూచి। కాయాన్నరాజి యాగస్థల శుద్ధులుచేసిన తత్వజ్ఞ చేష్టలరసి। బుధసిరాకృత న్మాధ్య పూర్తిగనిన। జ్ఞానులనహంక్రియా మూలజన్మకాంక్ష। నాత్మనాథుని కైంకర్య మాశపడుచు। నుందురనిచెప్పె లక్ష్మణ యోగివరుఁడు॥ ౫

తా॥ కృష్ణావతారమందు గోప స్త్రీలు గోప కుమారులు నడిచిన వృత్తిని నా గుణములను నా జాతులును దమకుఁ గావలెనని యెండి పెరియాళ్వారుల కోరిక యెఱుఁగ వలెననియు దివ్య దేశములయందుఁ బక్షులు మృగములు వృక్షములు శైలములు వీనియొక్క జన్మము లెత్తవలెనని కోరిన కుల శేఖరాళ్వారుల వైభవ మెఱుఁగ వలెననియు శ్రీ వైష్ణవులు నిత్య వాసముగా నున్న మందిరముల లోపలఁ గీట జన్మము కావలెనని కోరిన యాచార్యుల నెఱుఁగ వలెననియుఁ గాయశుద్ధి యన్నశుద్ధి రాజు యొక్క యాగస్థల శుద్ధులుం జేసిన పూర్వుల ప్రతిజ్ఞ లెఱుఁగ వలెననియుఁ బెద్దల యవతారముల పూర్తి కంటె జ్ఞానాధికులనియు నట్టివా రహంకార మమకారములును జన్మ కాంక్షలును బోగొట్టి శ్రియఃపతి కైంకర్యమున నాశఁ బడుచు నుందురని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శ్రీవైష్ణవ జన్మాదులు గనిన జ్ఞానాధికులని యెఱిఁగి వారి కులవృత్తాంతము లెంచరాదని యానతిచ్చి శ్రీవైష్ణవుల యందుఁ గొదువ లెంచ వలదని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ గతిదప్పి చనువారు గారు నా దాసులు చనిన మేలను విష్ణు సమ్మతెఱిఁగి। యపరాధ మెవ్వరికైన లేకున్నదా కానరాదను రమాకరుణఁ దెలిసి। భగవత్ప్రపన్నుల పనిమీకు లేదని యముఁడు దూతలతోడ నాడు టెఱిఁగి। యాళ్వారు లాచార్యులైన మహాత్ములు హరిదాసులే ఘనులనుట నెఱిఁగి। కొందఱయ్యలు వారందె కొదువఁ గనుచు। నోర్వ లేకుందు రిది యేమొ యోయతీంద్ర। యనురు లిందును నుందురో యనుచు నిగుల। నానతిత్తురు

మా లక్ష్మణార్య్యులెపుడు॥ ౬

తా॥ శ్రియఃపతి తమయొక్క దాసులైన పెద్దల గతి దప్పి పోయెడి వారు కారు పోయిన మంచిగతికేఁ బోదురని యానతిచ్చిరనియు నపరాధము లెవ్వరెవ్వరిపట్ల లేకయున్నవి గనుక యవి చూడరాదనియు సీతాదేవి హనుమంతునితో నానతిచ్చె ననియు భగవత్ప్రియన్నులతోడి కూటమి మీకుఁ బని లేదని యముఁడు తన దూతలకు బుద్ధి చెప్పెననియు నాళ్వారులును నాచార్య్యులును మఱియుఁ బెద్దలయిన వారలును శ్రీ వైష్ణవులే ఘనులని యానతిచ్చిరనియుఁ గొండఱు పెద్దలందుఁ గొదువలఁ జూచి యోర్వ లేకుండురనియు నో యెంబెరుమానారే యిది యేమో రాక్షసు లిందుండు రనుచు మిగుల నానతిత్తురని లక్ష్మణార్య్యులానతిచ్చిరి॥ (పెద్దలయిన శ్రీవైష్ణవ పరిభవము సేయ రాదని యానతిచ్చి యా పరిభవ పరులను రాక్షసులని మీఁద నానతిచ్చుచున్నారు॥).

సీ॥ ధృతిఁ బౌండ్రకుఁడు వాసుదేవ చిహ్నంబు మోచి విష్ణుండ నని చెడ్డ విధము వినరో। యమృతార్థులై దేవతాకారులై చెడ్డ రాహు కేతు ప్రకారములు వినరో। సీతాపహారంబు సేయు రావణుఁ డపుడు సన్న్యాసియై చెడ్డ జాడ వినరో। ఖ్యాతిలాభార్చన ప్రీతికై వైష్ణవాకారులై వారిలోఁ గలసి మెలసి। వారికపచార పడిచెడి వసుధలోన। వేషభాషలతోనుండి వెనుకదగ। పటములై విష్ణు నిగ్రహపాత్రు లగుదురాసురాకారులని లక్ష్మణార్య్యులనిరి॥ ౭

తా॥ పౌండ్రిక వాసుదేవుండనెడు రాక్షసుండు విష్ణు చిహ్నములైన శంఖచక్రాది చిహ్నలుగలిగి తానె విష్ణుండని చెడినవిధము వినరోయనియు నమృతము నిమిత్తమై రాహు కేతువులు దేవతాకారులై చెడిపోయిన విధము వినరో యనియు రావణుండు సన్న్యాసి వేషియై సీతాదేవి నెత్తుకొని పోయి పుత్రమిత్ర కళత్రాదుల తోడ మడిసి పోయిన జాడ వినరోయని యఖ్యాతిగానొకరు పొగడ వలెననియు నర్థకామాదులైన లాభములు కలవనియు వందఱిలోఁ బూజ గలదనియు శ్రీవైష్ణవాకారులై వారిలోఁగలసి మెలసి వారికపచార పడిచెడి యీభూమిలో వేషధారులైన వారి రూపుగలిగియు వారిభాషలు గలిగియు శరీరాంత మందా యుపచారమనెడు నగ్నిచేత దగ్ధపటముగా మడత చిరకాలి నట్లాత్మ నశించి శ్రియఃపతి యనుగ్రహమునకు యోగ్యతలేక నిగ్రహమైన వారిలోగూడిన రాక్షసాకారులని లక్ష్మణార్య్యలానతిచ్చిరి॥ ( శ్రీ వైష్ణవులలో రాక్షసాకారులు గలిగి చెడుదురని

యానతిచ్చి భగవద్భాగవతాచార్యులయపచారములకు వెరచి హితవుగా నడువవలెనని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ అవనిలోఁ బంచ మహా పాతకంబులు ఘన మందురా పాతకములకన్న । నారాయణుని మాని నరుఁడన్య దైవము పరుఁడని సేవించు పాప మధిక । మంతకన్నను నెక్కుడాత్మ విద్వైష్ణవ జాత్యాది మూలాప చార మరయ । మఱియంత కెక్కుడు మంత్ర మంత్రార్థ దాచార్య తద్భక్తాప చారకరణ । మనుచు శాస్త్రార్థ మెఱిఁగిన యతఁడె విష్ణు । వైష్ణవాచార్య తద్భక్త వైభవముల । దెలిసి యిష్టంబు సేయుచు ధృతినసిష్ట । మునుగవలెనని లక్ష్మణ యోగివరుఁడు॥ ౮

తా॥ భూమిలోఁ బంచ మహా పాతకంబులు ఘన మని చెప్పుదురా మహా పాపముల కన్నను ఘనమైన పాపము నారాయణుండైన శ్రియఃపతిని మాని మనుష్యుఁ డన్య దేవతను నిండె పరతత్వమని సేవించెనేని పాప మధికమనియు నంత కన్నను శ్రీవైష్ణవ జాతు లెంచెనేని యధికమైన పాప మనియు మఱి యంతె కెక్కుడు మంత్రార్థము ప్రసాదించిన యాచార్యుని పట్లను శ్రీవైష్ణవుల పట్లను నపచారములనియు ననుచు శాస్త్రార్థ మెఱిఁగిన యతండె విష్ణు వైష్ణవాచార్య వైభవ మెఱిఁగి తెలిసి యిష్టమే చేయవలెననియు నిష్టమునకు శక్తిలేకుండెనేని యా శ్రీవైష్ణవులకు నిష్టముగాని కార్యములు మానెనేని యిష్టము చేసినట్టే యని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ (భగవద్భాగవతాచార్యులపట్ల నపచార పడరాదని యానతిచ్చి యీ ముగ్గురిలో శ్రీవైష్ణవు లధికులని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ తెగియ కస్యము లెల్ల దీరఁ జేసుట కన్న భగవద నాదర ప్రభృతియించు। భగవద నాదర ప్రభృతి కెక్కుడులోక మాన్య భాగవతావమానకరణ । మంతకన్నన సహ్యమాచార్య విషయ తద్భక్త విషయము లందుఁ బరిభవములు। అందరికధికులు నాచార్యతుల్యులు నని వైష్ణవులఁ బాడ నదియుఁ బాప । మనుచుబూర్వులు చెప్పిరట్లాటఁ జేసి । విష్ణు వైష్ణవ దేశిక విషయమందు । భక్తివదలక నెప్పుడు భయము గలిగి। యుండవలెనని లక్ష్మణ యోగివరుఁడు॥ ౯

తా॥ చేయరాని కొదువలు చేయుట కన్నను శ్రియఃపతి యందు విశ్వాసములేక యుండునది హెచ్చైన కొదువయనియు శ్రియఃపతి యవమానమున కన్నను లోక పూజ్యులైన శ్రీభాగవతావమానము హెచ్చైన కొదువ యని

యు నాచార్యులయందును శ్రీవైష్ణవులయందును బరిభవించునదియు వనస్సున నసహ్యముగాఁ దలంచేనేని యంత కన్నను గొదువ యనియు నందఱికి నధికు లని నాచార్యులకు సరియని శ్రీవైష్ణవులను బూడకుండెనేని మహా కొదువయని యు ననుచుఁ బూర్వులానతిచ్చిరి యట్లగుటం జేసి శ్రీయశఃపతి యందును నా చార్యుల యందును శ్రీవైష్ణవుల యందును భక్తివదలక యెప్పుడును భయము గలిగి యుండవలెనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శ్రీయశఃపతికన్నను నాచార్యు లకన్నను శ్రీవైష్ణవు లధికులని యానతిచ్చి భగవద్భాగవతాచార్యుల ముగ్గురిని నొకటిగాఁ గూర్చి మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఆచార్య భాగవ తాచ్యుత దాస్యంబు కరణ త్రయంబునఁ గలుగనేల । ఇష్టంబుచేసి యనిష్టంబు చేయక తెలఁపులో మెలఁగుట దాస్య సరణి । భగవదిష్టానిష్టభావంబు లెఱుఁగున దధ్యాత్మ విషయశాస్త్రార్థ మరసి । యాచార్యభాగవతానిష్ట సమ్మతుల్ వరశాస్త్రమరసియు వారి నడిగి । తెలిసి ముగ్గురి యిష్టంబు దినముఁ జేయు । నాత్మసత్తయు నుజ్జీవనా తిశయము । గలిగి యిహమందె మోక్షసౌఖ్యంబుగందు । రనుచు లక్ష్మణ మునివరుం డానతిచ్చె॥ ౧౦

తా॥ ఆచార్యులును భాగవతులును శ్రీయశఃపతిని నీముగ్గురి దాస్యము మనస్సున వాక్కునను గాయకములఁ గలుగ నడిచెనేని మేలనియు వీరలకు నిష్టంబుచేసె యిష్టముగా నిదిమాని వారి హృదయ మెఱిఁగి దాస్యము చేయు నది మంచిదనియు శ్రీయశఃపతి యిష్టమును ననిష్టమును నధ్యాత్మ విషయమైన శాస్త్రముచేత నెఱుఁగ వలెననియు నాచార్యులకును భాగవతులకును నిష్ట ముగాని కార్యములు రహస్యాదులు చదివిన వారిని నడిగి తెలుసుకొని ముగ్గురి యిష్టములు నిశ్చయముగాఁ జేయవలెననియు నీయాత్మ సద్గతులకు నుజ్జీవనం బతిశయముగాఁ గలిగెననియు నీలోకమం దానంద సౌఖ్యములు గలుగునని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (భగవద్భాగవతుల పూర్తి శ్రీవైష్ణవులయందు నిలి చి యుండునని యానతిచ్చి శ్రీయశఃపతికి ననిష్టముచేసిన వారిని శ్రీవైష్ణవులకు ననిష్టముచేసిన వారిని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ వీరికిష్టముఁ జేయ వెరవుచాలక యున్న మఱచి యనిష్టంబు మా నందేగును । భగవదనిష్టంబు బహుభంగిఁ జేసియుఁ జైద్యకాకాదులు స్వస్థు లైరి । దేశికానిష్టంబు తీరఁ జేసియు మహామూర్ఖులౌరాను ముక్తుఁడయ్యె । భాగవతానిష్ట పరుఁ డెక్కడను దొల్లి కడతేరెనని విని కనుటలేదు । అగుట

నిష్టంబుఁ జేయుననహర్హుఁడైన। మాన సానిష్ట కృత్యంబు మానఁదగును। సాంమదా
నంబుతో నని స్వామి గనుక। తెలిపి చెప్పను లక్ష్మణ దేశికుండు॥ ౧౧

తా॥ భగవద్భాగవతాచార్యులకు నిష్టము సేయ నెరవు చాలకుండెనేని
యనిష్టము మఱపుననైనఁ జేయక యుండవలెననియు శ్రియఃపతికి ననిష్టములు
బహువిధములుగాఁ జేసిన శిశుపాలుఁడును గాకాసురుఁడును గృపకుఁ బా
త్రులైరనియు నాచార్యునికి ననిష్టము చేసిన మహామూర్ఖుఁడైన నాలూ
రానుముక్తుండా మెనియు భాగవతులకు ననిష్టము చేసిన వారెవరు డెకరుడ
ను గడతేరరని విన్నది కన్నది లేదనియు నవుట యెన్నివిధములను శ్రీవైష్ణవులకు
నిష్టము సేయ నహర్హుండే కాని యనిష్టమునకు నహర్హుండు కాఁడనియు నెన్నివిధ
ములను మనస్సున ననిష్టము మానియుండవలెననియు నీయాత్మల నేలిన స్వామి
గనుక శ్రీవైష్ణవులకు ననిష్టమైన కార్యము మానవలెనని లక్ష్మణాచార్యులానతిచ్చి
రి॥ (నేవిధమునవైనను శ్రీవైష్ణవులకు ననిష్టము మానియుండవలెనని యానతి
చ్చి సంసారుల కన్నను దనకన్నను శ్రియఃపతి కన్నను శ్రీవైష్ణవు లధికులని
మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ దైవదగ్ధులకన్న దనకన్న హరికన్న నధికులు వైష్ణవులనుటఁ
జూచి। జన్మాద్యుపాధిసంజాతాప కృష్టతఁ జూడక యాత్మకృపాశుద్ధిఁ జూచి।
భగవదాత్మ ప్రాప్తిబంధు భావనుఁ జూచి నిజ జనరక్షణ నియతిఁ జూచి।
యానాత్యసముగా నానతిచ్చుటఁ జూచి స్వస్వకీయస్వామి సరణిఁ జూచి।
తనకు బంధువులాప్తులు దారకులును। బోషకులుభోగ్య భూతులు పుణ్యము
లును। వైష్ణవులెకాని మఱి లేరు వసుధలోన। ననుచు లక్ష్మణ మునివరుం
డానతిచ్చు॥ ౧౨

తా॥ దేవతులన సంసారులై శాపదగ్ధులై చెడిన బ్రహ్మరుద్రాదిదేవతు
లకన్నను దనకన్నను శ్రీవైష్ణవులే యధికులనియుఁ గొంచెపు జాతులఁబుట్టిన
వారిని దూషణగా జూడక తనయాత్మ సమర్పణమైన బుద్ధిచేత రక్షకులనియు
శ్రియఃపతికి నాత్మయును బ్రాణమును బంధువులును వీరలనియు వారుర
క్షించెడి విధమును నీతని జూడవలెననియు నాచార్యులకు సమానుని యానతిచ్చు
టచూచి తనకుఁ గలదైవమనియుఁ దనకు స్వాములనియు దనకు బంధువుల
నియు నాప్తులును దారకులును బోషకులును భోగ్యభూతులును బుణ్యములును
నివియన్నియు శ్రీవైష్ణవులేకాని మఱియెవ్వరు లేరు భూమిలోననని లక్ష్మణాచా
ర్యులానతిచ్చిరి॥ (శ్రియఃపతికిని శ్రీవైష్ణవులకును నయిక్యతఁ జెప్పి తన భక్తు

లైనవారే తమకు బంధువులని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ త్యక్తబంధుస్నేహ భక్తబంధువునేను భక్తులేనా సర్వ బంధువులును । నాకుఁ దనుప్రాణ నయనాత్మ తుల్యులు నాభక్తులెప్పుడు నాకుఁ బ్రియులు । కులవృత్తి విద్యాది గుణములచేతఁ గొన్నికొదువలుగలిగిన వదలవారి । నన్నాదిభోగ్య పదార్థాళి నగుదునా దాసజిహ్వాగ్ర సంస్థాయినగుచు । ననుచు సర్వేశ్వరుండు దానె యానతీయ । వినుచు నుండియుఁ గొందఱు వెఱ్ఱులగుచు । విష్ణుభక్తుల దూషించు విధమదేమొ । తెలియరాదనె లక్ష్మణదేశికుండు॥ ౧౩

తా॥ తమకుబంధువులు లేరనియుఁ దమకుస్నేహమయిన భక్తులకుఁ బంధుండేననియు నాభక్తులే సర్వ విధబంధువు లనియుఁ దమకుఁ దిరు మేనును నాత్మయుఁ దిరు నయనములును నక్తులును నివి యన్నియు భక్తులేయనియు వారు శ్రియఃపతికిఁ బ్రియమైన వారలనియు వారికులమును నడతలును విద్యయు నాత్మగుణములచేతఁ గొన్నికొదవలు కలిగినను వారల వదలననియు నన్నపానాది పదార్థములుకూను తమ దాసుల జిహ్వాగ్రమందుఁ దాముండి సర్వమైన రుచులను నారగింతుననియు ననుచు సర్వేశ్వరుడైన శ్రియఃపతి తామె యానతీయంగా వినుచుండి కొందఱు వెఱ్ఱులైనవారు విష్ణుభక్తుల దూషించు విధమదేమో తెలియరాదని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( శ్రియఃపతి తమదాసులపట్లసర్వమైన భోగములను ననుభవించుచునుందునని యానతిచ్చి వారిపట్ల నపచారపడి చెడినవారిని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ అంబరీషునకుఁ దా నపచారపడి తొల్లి దూర్వాసుఁడను ఋషి దూరఁ బోయె । సభ్యుఁడయ్యును బరిచరవసువనురాజు పక్షపాతం బాడి భంగపడియె । నటుగాఁగ భాగవతాపచారక్రౌర్య మదివైన తేయ వృత్తాంతమును । కానవచ్చును మఱి కథలందు వినంబడు దొడ్డకొంచెంబని తోఁచిపోదు । అనిబహువిధమై వీరియభిజనాదు । లర్థ కామాదులకు మూల మగుచు వచ్చు । సావధానంబుతో దాని జూడబోక । యుండవలె ననె లక్ష్మణయోగివరుఁడు॥ ౧౪

తా॥ భగవద్భక్తుండైన యంబరీషునకు నపచారపడి దూర్వాసుండను ఋషి తూలనోయెననియును పరిచర వసువను రాజు దేవతలకును ఋషులకును వాదమై యా రాజునుగోరి యుభయవాదులును వ్యవహారమును దెలిపిన ఋషులకార్యమును గెలిపించి దేవతుల కార్యమోడించెను గనుక యా రాజు

భంగపడి పోయెననియు, నటు గనుక భాగవతాపచారము క్రూరములైన
వైనతేయ వృత్తాంతమందె కానవచ్చుననియు మఱియుఁ దక్కిన కథలం
దుఁ గానవచ్చుననియు వినబడి యుండుననియు నదియెట్టులన దొడ్డకొంచె
మని తోఁసిపోదనియు నట్టి బహువిధములుగా దేహసంబంధులును గోరికలును
నివి మొదలుగా నజ్ఞానము వచ్చుననియు సావధానంబు తోడ వాని త్రో
వఁబోక యుండ వలెనని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ (భాగవ తాపచార
క్రూర మానతిచ్చి శ్రీ వైష్ణవుల తలంపు భేదములను ననుష్ఠానములను మీఁద
నానతిచ్చుచున్నారు.)

సీ ॥ షడ్రసోపేత భోజనము చేసిన విప్రుఁ డొకఁ డాయెఁ దా నె
నదోపవాసి । తనభార్యసంగతిఁ దనయులఁగనిన యాబ్రాహ్మణుండే సదా
బ్రహ్మచారి । తనభర్తయుండంగఁ దా నన్యసంగంబు తెలిసి చేసినది పతివ్ర
తాయె । హింస గాదని విప్రుఁ డెఱిఁగియుఁ గ్రతుపశు విశసనంబునఁ దాఁ బ
విత్రుఁడయ్యె । వాము చేసియుఁ దలఁపు భేదమనట్టు। కానివారైరి వారుత
త్త్రమముఁ దెలిసి । ఘనులయందును దోషంబు గని గుణముగఁ । దెలియ
వలెనని లక్ష్మణ దేశికుఁడు॥ ౧౫

తా॥ షడ్రసములఁగూడిన భోజనము చేసిన బ్రాహ్మణుండు నిత్యోపవా
సియనియుఁ దనభార్యనుగూడి కొమాళ్లఁగనిన యాబ్రాహ్మణుండు సదా
బ్రహ్మచారియనియుఁ దన పెనిమిటినైన పురుషుండుండఁగాఁ దెలిసి పరపు
రుషునిగూడిన యాయన్న పతివ్రతయాయెననియు హింస సేయరాదని బ్రా
హ్మణుండు హింసఁజేసి పవిత్రుండాయెననియుఁ దా మీలాగునఁ జేసి యుఁ
దలంపుభేదములవలనఁగానివారైరి వారాక్రమము దెలిసి ఘనులైన శ్రీవైష్ణవు
లపట్లదోషములు గలుగఁజూచినప్పటికిని నవి గుణములుగా నేచూచి తెలియవలె
నని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శ్రీవైష్ణవుల తలంపులను నడతలను నానతిచ్చి
వారిపరాక్రమము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ కాలకూటముసీల కంఠుండు దినెనని క్షుద్రదేవత దాఁ జూడఁ
గలదె । తన ఫణంబుల భూమిఁ దాల్చె శేషుండని యన్యనాగము తల నా
నఁగలదె । యంభోధిపుడిసిట నడఁచి త్రాగె నగస్త్యుండని హీన ముని చేర నై
నఁగలఁడె । జారచోరత్వ ప్రశస్తుండాయెను కృష్ణుఁడని యన్యులకుఁ జెల్లున
లవి యగునె । యట్టు సర్వేశ్వరుని దాసులైన వారు । తలంచి సాహస
కృత్యముల్ ధరణి లోనఁ । జేసిరనియును దానును జేయఁ గూడ । దనుచు

లక్ష్మణ మునివరుం డానతిచ్చె॥ ౧౬

తా॥ కాలకూటవిషము రుద్రుండు గనుక శ్రియఃపతియనుమతిని బ్రసాదపడి జీర్ణించుకొనెనని కొంచెపు దేవతలా విషము చూడఁగలరా యనియు దనపడిగలచేత భూమండలము శేషుఁడు గాన మోచెను నన్యములైన పాములు తలనానఁగలవా యనియు సముద్రము పుడిసిట నడఁచి యగస్త్యుండు మహాఋషి గనుక త్రాగెను గొంచెపు ఋషులు సముద్రమునైనఁ జేరఁగలరా యనియు జారచోరుఁడై కృష్ణుండు గనుక చెల్లించుకొనెను దక్కినవార లీరెండు పనులుచేసి చెల్లించుకొనలేరనియు నటువలె సర్వేశ్వరుని దాసులైనవారు తమ మాసములకు సరిపోయినట్టు సాహసకృత్యములు లేక యత్యంత సాహసమైన కార్యములు భూమిలోఁ జేసిరనియుఁ దానును వారివలెఁ జేయఁగూడదని లక్ష్మణార్య లానతిచ్చిరి॥ (ఆ మహాభాగవతులైన శ్రీవైష్ణవుల సాహసముల నానతిచ్చి తమయందుపదేశ బలముచేత నెవ్వరు జేయరాని కార్యములు శ్రీవైష్ణవులు చేసి నిర్వహింతురని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ మంత్రప్రభావంబు మహిమ నెఱింగినవాఁడు కౄర సర్పముఁ లీలఁ
గేలఁబట్టు। నగ్నిసంస్తంభన మందు నిరూఢుఁడై చిచ్చులో వెరువకఁ జొ
చ్చియుండు। నౌషధ సామర్థ్యమరసిన రోగియె చేయరాని యపథ్యశీలుఁ
డౌను। సిద్ధసమూహము విశ్వసించిన పురుషుండు దగ్మాంతరంబులఁ దలఁచ
కుండు। భారముడిగినవాఁడె నిర్భరుఁడునగుచు। ననుచుఁ దెలిసిన వారుమ
హాత్ములందుఁ। గాదువవలెందోఁచె నేనియు గుణముగానె। తెలియవలెనె
లక్ష్మణదేశికుండు॥ ౧౭

తా॥ విషదష్టమైన మంత్రము గలిగినను గ్రూరసర్పమును లీలగా భయము లేక చేతఁబట్టవచ్చుననియు నగ్నిసంస్తంభనమందు నిరూఢిగా నభ్యాసపరుఁడయ్యెనేని చిచ్చునందు వెరువకచొచ్చి యుండుననియు నౌషధసామర్థ్యమరసిన రోగి చేయరాని యపథ్యములు చేసి శీలుండగుచు నుండుననియు సిద్ధసాధనమైన ధర్మమును నెఱింగిన మహానుభావులు ధర్మాంతరములను దలఁచకుండురనియు భారము లేనివాఁడు నిర్భరతగా భారములేక యుండుననియు ననుచు దెలిసిన వారికి మహాత్ములైన వారియందుఁ గాదువలెతోఁచె నేనియు గుణముగానే తెలియవలెనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శ్రీవైష్ణవ సాహసకృత్యముల నానతిచ్చి యవిగుణముగానె చూడవలెననియు వారిపట్ల జేసినయ

పచారమెంతమనసు దీరదని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ భూమిపగిలిన రెండు పాదివి కూడఁగాఁ బట్టి యసఫ్ఫుచ నదిగూ ర్చునైనవచ్చుఁ। గొండ ప్రకటలువాసి కూలుచుండఁగాఁ బట్టి యంటించిగు వినిల్పనైనవచ్చు। నాకాశ మండలి నడఁచఁ బైఁబడు నప్పుడరచేత నైన నానవచ్చు। వెలయు నుల్లంఘించి పడలుసముద్రంబు కట్టగానైనను గట్ట వచ్చు। నట్లుగూడదు భాగవతాపరాధ। మాత్మకరణ త్రయంబున నంటెనేని। శాంతిఁ బొందింప నెవ్వరి శక్యమనుచు। నానతిత్తురు మా లక్ష్మణార్యులెపుడు॥ ౧౮

తా॥ భూమిపగిలి రెండు ప్రకటలయ్యేనేని రెండను బాదిగి కూర్చవచ్చుననియుఁ గొండరెండు పాయలుగాఁ గూలిపోవ నప్పుడంటించియదిగిలుప వచ్చుననియు నాకాశ మండల మండలిని నడంచఁ బైఁబడునప్పుడు అరచేతనైన నానవచ్చుననియు సముద్రము చెల్లెలికట్టఁదాఁటి భూమి మించవచ్చిన మించరాకుండఁ గట్టకట్టవచ్చుననియు నటువలెఁగూడదు భాగవతాపచార మాత్మకు మనస్సున వాక్కునఁ గాయికమున నంటెనేని శాంతినిబొందిం పనెవ్వరికైనను శక్యముగాదనియు ననుచు లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (భాగవతాపచారము శాంతఁబొందింప నెవ్వరిచేతఁ దీరదని యానతిచ్చి యపచారములకు వెరచి యుండవలెనని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ సకలకర్మంబుల జ్ఞానంబు దిగమ్రింగుఁ గినిసిన తిమితిమింగిలముభంగి। జ్ఞానంబు భక్తిచే సెమనియుఁ దిమింగిలముచేఁ దత్తిమింగిలముభంగి। భక్తినిమ్రింగుఁ బ్రపత్తి తిమింగిలగిలమును మ్రింగుతద్గిలముభంగి। నా ప్రపత్తిని మ్రింగుననఁగ భాగవతాపచార మగుస్త్యగడా జలధిమ్రింగు। భంగినని వాసుదేవ ప్రభావ మెఱిఁగి। స్వాములను బుద్ధితద్దాస జనులయందుఁ। ద్రివిధ కరణాప చారంబు తెలిసి వెరసి। యుండవలెనని లక్ష్మణ యోగివరుఁడు॥ ౧౯

తా॥ సకల కర్మములను జ్ఞానము దిగమ్రింగుననియుఁ దిమియనెడి మత్స్యమును దిమింగిలము మ్రింగిన తీరుననియు జ్ఞానము భక్తిచేతఁ జెడుననియుఁ దిమింగిలమును గిళమనెడి మత్స్యమును మ్రింగిన తీరుననియు నాభక్తిని మ్రింగుఁ బ్రపత్తియనియు గిళమనెడి మత్స్యమును దద్గిళము మ్రింగినభంగి ననియు నాప్రపత్తిని మ్రింగుభాగవతాపచార మనియు నగస్త్యమహాఋషియీతీరున మత్స్యముల గర్భీకరించుకొని యుండెడి సముద్ర జలములు

తనచేతిలోనుంచి తాగ్రేసనియు నని వాసుదేవుండైక శ్రియఃపతి వైభవమె
ఱింగి మనకుస్వామియను బుద్ధిని శ్రియఃపతి దాసుల యందుంచి యీమూఁడు
విధములైన మనోవాక్కాయ కాదులయం దపచారము లంటకుండ వలెనని
లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ ( భాగవతాపచారము యొక్క బలవంత మానతి
చ్చిభ్యాగులకొఱకు వెనుకటి వారనేక ప్రయాసలంబడి శరీరాభి మానము లి
చ్చినవారిని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ గార్హస్థ్యమును నడపఁ గాఁ గోరి ముందొక బ్రాహ్మణుం
డతిథికి భార్యనిచ్చె । సత్యంబునకు హరిశ్చంద్రుఁ డిడుమలం బొంది చిక్కిచం
డాలుని సేవఁజేసె । శరణు జొచ్చినవారి సంరక్షణముఁ జేయ సిబిక పోతా
దులు శిబులైరి । యౌదార్య గుణమున నైబలి యెఱిగియుఁ దన రాజ్యహాని
కిఁదలఁకఁ డాయె । నాత్మగుణసిద్ధి కొఱకు నిష్ఠైనచోట । నాత్మ సంరక్షణార్థ
మిష్టైన నేమి । తనకు వైష్ణవ పారతంత్ర్యంబు గలిమి। తెలియవలెనని లక్ష్మణ
దేశికుండు॥ ౨౦

తా॥ గృహస్థ ధర్మమతిథి పూజానిమిత్తము గనుక యతిథులకుఁ దనభా
ర్యను మునుపు బ్రాహ్మణుం డిచ్చెననియు సత్యముచెల్లించుకొఱకు హరిశ్చం
ద్రుండు చండాలుని గొలిచెననియుఁ బ్రాణభీతిచేతఁ దను మరుగు చొచ్చినవా
రి ప్రాణము రక్షించునిమిత్తము సిబిచక్రవర్తియుఁ గపోత పక్షియుఁ దమ శరీ
రములను నిచ్చిరనియు నౌదార్య గుణముకొఱకు బలిచక్రవర్తి తనరాజ్యము
పోమేటప్పుడు వచ్చినకార్య మెఱింగియు నిచ్చెనని వెడలనాడినది లేదందు
నాయుని రాజ్యహానికి వెరువక యిచ్చెననియు నాత్మకు ఖ్యాతిగుణములు త
మకుఁ గీర్తిగా భూమిలో నిలువవలెనని యీతీరునఁ జేసినచోట సీయాత్మ
సంరక్షణార్థము ఖ్యాతి లాభాదులు విడిచి శేషత్వ పారతంత్ర్యాలు
తమకుఁ గలుగ నెన్నివిధముల పోకలుపోయినను విశేషమే యనియుఁ దనఁ
కుఁ గడతేరుటకు శ్రీవైష్ణవ పారతంత్ర్యాములు కలిగినఁ గలిమి బలిమియని
యీసీలాగున వివరముగాఁ దెలియవలెనని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ ( శేష
త్వపారతంత్ర్యాములు శ్రీ వైష్ణవులకే చేయవలెనని యానతిచ్చి దాస్యలక్ష
ణములును దాస్యవృత్తియు మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఏలినాతని చిత్త మెఱింగి చెప్పినరీతిఁ దాఁ జేసినప్పుడు దాసుఁ
డౌట । వృత్తిని నిమయమున విహరింపఁ జూచినఁ దా సమ్మతించిన దాసుఁ డౌట ।

యారగించిన శేష సుమృతంబుగాఁగొని తాస్వీకరించిన దాసుఁడౌట । కట్టి విడచిన చీరగట్టి సంతోషించి తావెంటఁదిరిగిన దాసుఁడౌట । ముడిచిపూసి నవెల్లను ముడిచిపూసి పేరు ముద్రలు ధరియించి ప్రియముభయము । తనకుఁ గలిగిన శ్రీ హరిదాసుఁడౌట । యనుచు లక్ష్మణ మునివరుం డానతిచ్చె॥ ౨౧

తా॥ ఏలినస్వామి హృదయ మెఱిఁగి వారానతిచ్చిన రీతి నాచరించిన వాఁడు దాసుఁడనియు వృత్తియైన నడతచేత వారి యిచ్చవచ్చిన తీరున నడచి నప్పటికిఁ దాను సమ్మతించిన దాసుఁడౌట యనియు నారగించిన ప్రసాదశేషము నమృతముగా నెంచి తాను బ్రసాదపడెనేని దాసుఁడౌటయనియు గట్టి విడిచిన వస్త్రములు తాఁ గట్టుకొని సంతోషించి తాను సేవఁజేయుచును వెంటవెంటఁదిరిగిన దాసుఁడౌట యనియు వారు సుగంధాదులు ముడిచినవియు గంధకస్తూరిపరిమళ వస్తువులు వారు పూసినవియుఁ దాను ముడిచి పూసెనేని దాసుఁడౌననియు బూర్వాచార్యుల పేరును భగవత్సంబంధము మొదలైన పంచ సంస్కారము కలిగెనేని దాసుఁడౌననియుఁ బ్రియము భయము కలిగెనేని శ్రియఃపతి దాసుఁడౌననియు లక్ష్మణాచార్యులానతిచ్చిరి॥ ( ఏలినవారానతిచ్చిన క్రమమునఁ జేసెనేని దాసుఁడౌనని యానతిచ్చి శ్రీవైష్ణవుల గుణాతిశయముల నెంచరాదని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఏవర్ణ మైనను నేయాశ్రమంబైన నేదేహమెత్తిన నెచట నున్న । నెట్టికర్తులైన నేపాపయుతులైన నేవిషయాసుల నెంతవారలైనఁ । గుత్సితతనులైన గుణహీనులైనను నొకటి చేయకయున్న నొదిగియున్న । హరిదాసులను స్వాములనుబుద్ధి సేవించినమూర్తులై తన్ని యమనంబుచేసి । యంతరాత్మయైన సర్వేశుఁడాదరింప । నుండనేర్చిన వారికి నుర్విలోన । నొకరు సరి లేరు నిత్యులందుండి లేని । తెలియవలెనని లక్ష్మణ దేశికుండు॥ ౨౨

తా॥ ఏజాతి వారైనను నేయాశ్రమమున నుండినను నేదేహమెత్తినను నెక్కడ నుండినను నేనడతవారైనను నవయవముల కొదువలు గలవారైనను వయసునఁ గొంచమైనవారైనను గుత్సిత దేహులైనను గుణహీనులైనను నొకపని సేయని వారైనను మూరముగా నొదిగియుండినను శ్రీవైష్ణవులు తన్నేలిన స్వాములని తనబుద్ధిని సేవించి హరికే దాసులైయుండునట్టివారి యాజ్ఞనుఁ జేసి యంతర్యామియైన సర్వేశ్వరుం డాదరించిన వారలనియు నీలాగున నుండనేర్చినవారికి నీభూమియందు నెవ్వరును సరిలేరు వారు నిత్య సూరులందుందురని తెలియవలెనని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥

గద్య॥ ఇది ముముక్షు జనకల్పకంబను మహా ప్రబంధంబునందు భాగవత వైభవంబు చెప్పుచో భగవద్భాగవతాచార్యావతారంబులు లోక సంరక్షణార్థంబును సాధు పరిత్రాణార్థంబును నని యెఱింగినవారికిఁ దద్గతగుణదోషంబులు రెండును నుపాదేయ మనియు నుత్కృష్ట భాగవత సంబంధమున నపకృష్ట జన్మాది దోషంబును బోయి తత్సామ్యంబు గలుగుననియును నైహికాముష్మికా లోకోపకారకులై తనకు సహవాస యోగ్యులైన శ్రీవైష్ణవులకు నహంకార మమకారనివృత్తి పూర్వకముగాఁ బరతంత్రులై యుండవలయు ననియు నాదిదేవ సమాశ్రయణంబున జాత్యాది దోషంబులుపోయి పరిశుద్ధు లౌదురనియు జ్ఞానాధికులా యహంకార రహిత జన్మంబు లాశపడి యనుష్ఠించిన ప్రకారంబును భాగవతులందు దోష దర్శనంబు చేయువా రసురులనియు దురభిమాన వైరంబులలోన నుండఁగా బహిర్ద్వేషధారులైనవారు చెడ్డ ప్రకారంబును నకృత్యకరణ భగవద్భాగవతాచార్యాద్యపచారంబులకు నుత్తరోత్తర క్రౌర్యంబును నిష్టంబుచేసి యనిష్టంబు మానుటే కైంకర్య మనియును నిష్టంచేయ సమర్థులైన ననిష్టంబు చేయఁ గూడదనియును శ్రీవైష్ణవులు సర్వాధికారులనియు నాచార్యతుల్యులనియును సర్వవిధ బంధువు లనియును సర్వేశ్వరుని కత్యంతాభిమతులనియును భాగవతాపచార క్రౌర్యంబు బహుప్రకారంబుల వర్ణించుచును నాత్మగుణ రక్షణమునకై యనేక ప్రయాసంబులఁ బొందిన వెనుక యాత్మ రక్షణార్థంబుగాఁ బారతంత్ర్యను సంధానంబు మంచిదనియును దాసలక్షణంబును శ్రీవైష్ణవుల వర్ణాశ్రమాది నిరూపణంబులు సేయరాదనియును నన్నది యష్టమ ప్రకరణము॥

శ్రీమదచ్యుత శఠకోప యతిరాజ వరవరముని నిజగురుభ్యోనమః.



శ్రీమతేరామానుజాయనమః.

# ముముక్షుజనకల్పకము.

## నవమ ప్రకరణము.

శ్రీవైష్ణవులజాతి వర్తనగుణ నిరూపణము చేయరాదని యానతిచ్చి శేషత్వ పారతంత్ర్య సుఖమునకు సరిలేదని మీద నానతిచ్చుచున్నారు॥

సీ ॥ పురుషోత్తముండు గావిభూతి ద్వయస్థిత ప్రత్యగాత్మల కెల్ల భర్తభోక్త। యట్లైన విషయ సుఖానుభవంబులు సతియును బుంభావసతి యుంగూడి । యనుభవించినరీతి నానందరసోతంబు తనదానె భోగించుత రుణిసుఖము । కైవల్యసుఖమని కనిరోసి చకచని భర్తతోంగూడెడు భార్య భంగిం । బరమపురుషుని శేషత్వ పారతంత్ర్య । లక్షణోచిత వృత్తిసుల భతం దెలిసి । కూడిభోగించ నేర్చినం గువలయమున । ముక్తసములనె లక్ష్మణ మునివరుండు॥ ౧

తా॥ పురుషోత్తముండైన శ్రియఃపతి నిత్యవిభూతి లీలావిభూతులలోనా త్మలకెల్ల భర్తయై భోక్తయై యుండుననియు నిట్లైన చోట శ్రీవైష్ణవులలోం గలసిమెలసి వారికైంకర్యమే సుఖమనియు నాండుది పురుషుని రూపమైన యాం డుదానిని గూడి యనుభవించ నేర్చిన రీతిననియు నాండుది యాండుదానిని గూడి భోగింప నానందము లేకయుండినట్లె యుండిన కైవల్యసుఖము మాని యట్టి సుఖమును రోసి చకచని పెనిమిటి తోడం గూడి భోగించి నట్లనియు శ్రియఃపతికి శేషత్వపారతంత్ర్యములంగూడిన నడత సులభమైన సుఖమనియు నీలాగునం దెలిసి కూడి భోగించ నేర్చిన వారు సంతోషముగా ముక్తులతోడ సమానమై కూడుదురని లక్ష్మణాచార్యులానతిచ్చిరి॥ ( శేషత్వ పారతంత్ర్యాదుల చేత శ్రియఃపతి కైంకర్యమనెడి సుఖమునకు సరిలేదని యానతిచ్చి పంచభూత మయమైన దేహపోషకము మీంద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ తన పంచభూత సందర్భమైన శరీర పోషణకును బంచ భూత మయము । లౌయన్న పానాదులౌగదా సాధనంబని గోడ మృత్తికే వలికె

నట్లు । పోషించి యీయాత్మ భోగించె ననునది యవివేక కార్య మట్లాటఁ
జేసి । తనకంతరాత్మలైయె దారకాదులునైన నానందమయుని భోగాశఁ దగిలి।
జ్ఞానమయుఁడైన తా నన్య సంగమ డిగి । యతనితోఁ గూడి భోగించు నతఁడె
ముక్తుఁ । డవనిలోనైన మఱి యెచ్చటైనఁ దప్ప । దనుచు లక్ష్మణ మునివరుం
డానతిచ్చు॥ ౨

తా॥ పంచభూతములతోఁ గూడిన శరీరమునకుఁ బోషకములా పంచభూతములతోఁ గూడిన యన్నపానాదులు సాధనము లనియు నందలి పోషకము లాపంచభూతములతోఁ గూడిన యన్నపానాదులు సాధనము లనియు నందలి పోషకములు మట్టికోడకు మట్టిచేతఁ బూసినట్లనియు నిట్టి శరీరములను బోషించి యీయాత్మ దానుభోగించవలెనను బుద్ధి యవివేక కార్యమనియు నట్లాటంజేసి తన కంతరాత్మలైయె తారక పోషక భోగ్యాదులకుఁ గర్తలైయె యానంద మయుఁడైన శ్రీయఃపతియొక్క భోగముమీఁది యాశ లతిశయించి తగిలి జ్ఞానమయుఁడై తానన్య సంగములు మానవలెననియు నతనితోఁ గూడి భోగించు నతండె ముక్తుండౌననియు భూమిలోపలనైన మఱియెచ్చటనైన నఁదప్పదనుచు లక్ష్మణాచార్యు లానతిచ్చిరి॥ ( శ్రియఃపతితోడి భోగము మఱచి దనియానతిచ్చి యపాయ్యమైన యుపాయ సాధనములనువిడిచి యుండవలెనని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ సాపాయ దుశ్శక సాధ్య సాధన జాల మప్రాప్తమని యందు
నాశ విడిచి । యపరాధములకెల్ల నాలయంబగునన్న నగతినకించను నల్ప
మతిని! ప్రకృతి సంగతిఁ బుణ్యపాపకర్మ జ్ఞానవాసనారుచులనువానిఁబాపి।పు
రుషోత్తమోపేయ భూత లక్ష్మీనాథని వెసాధన మవైనన్నుఁజేర్చు।మనుచుసం
సారాంధ పంచకా నంతరమునఁ । జేతనునిచేతననిపించి శ్రీధరునకు।నాత్మనిప్పిం
చు హాచార్య ననవరతము । మఱువవలదనె లక్ష్మణ మౌనివరుఁడు॥ ౩

తా॥ అపాయములై దుస్తరములై సాధించిన ఫలాదులు ప్రాప్తముగా నివనియుండలి యాశవిడిచి యుండవలెననియు సర్వాపరాధములకు నునికపట్టైనదాసుని గతిలేనివాఁడనియు నకించనుఁ డనియు నల్పమతి ననియుఁ బ్రకృతిసంగతిన్నైన పుణ్యపాపకర్మ జ్ఞానవాసనారుచులను విడిచి పురుషోత్తముండై యుపేయభూతుండైన శ్రీయఃపతి మీరె సాధనమై మమ్మఁజేర్చుమనియుఁ బంచసంస్కారము గలుగఁజేసి యీచేతనునిచేత శరణాగతుండనై

తినని పించి శ్రియఃపతికి నీ యాత్మను సమర్పణముఁ జేయించిన యాచార్యుని మఱువ వలదని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( ఈ చేతనునిచేత శరణాగతుఁడనైతినని యనిపించిన యాచార్యుని మఱువ వలదని యానతిచ్చి యాత్మాపహారమున కన్నను సరియైన పాపము లేదని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఆత్మాపహార తుల్యాఘ పాపము లేదు ఆసామ్ము కర్త సర్వాధికుండు। తద్దాసతుల్య సద్ద్రవ్య పుణ్యము లేదు స్వీకరించెడు వాఁడు శేష శేషి। యీయర్థ మెఱిఁగించి యే దేశికుఁడు హరికాత్మ సమర్పింప నానతిచ్చెఁ। దత్కృతజ్ఞతకన్న దత్కృతఘ్నత కన్నఁ బుణ్యంబు పాపంబు పుడమి లేదు। అగుటఁ జేసియు నీ రహస్యార్థములను। నుపకరించిన యా దేశికోత్తములను। మఱువకను వర్తనము చేయ మంచి దనుచు। నానతిత్తురు మా లక్ష్మణార్యు లెపుడు॥ ౪

తా॥ తన యాత్మను దాన పహరించుటకన్నను సరియైన పాపము లేదనియు నాత్మ యనెడి సొమ్మునకుఁ గర్త సర్వాధికుండు శ్రియఃపతి యనియు నతని దాస్యమునకు సరియైన పుణ్యము మఱియొకటి లేదనియు గొన్ని నవధరించెడు వాఁడు శ్రియఃపతి సర్వశేషి యనియు నీయర్థము లెఱిఁగించి యే యాచార్యుండు శ్రియఃపతి కీయాత్మను సమర్పించు మని యానతిచ్చె నో యాయాచార్యుండు చేసిన మేలు తలంచునది పుణ్యమనియు నాచార్యుండు చేసిన మేలు మఱచుట కన్నను పాపము లేదనియు భూమిలో నీ రెంటికి సరియైన పుణ్యపాపములు లేవనియుఁ గాఁగా మఱియు నీ రహస్యార్థముల నుపదేశము చేసిన యాచార్యోత్తములను మఱువక యను వర్తనము చేయునది మంచిదని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( ఆచార్యుఁడు చేసిన యుపకార మెప్పుడును దలంచ వలెనని యానతిచ్చి కర్మములు చేసినను శరణాగతునికిఁ బాత్రుఁడౌనని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ కర్మాధికారియై క్రమముతోఁ జేయఁగా స్వపర విజ్ఞానంబు సంభవించు। జ్ఞానంబుచే యోగ సాధనస్థుఁడై భావించఁగాఁ బరభక్తిపుట్టు। భక్తిచేఁ దత్పరభావుఁడైనను సిద్ధ ధర్మస్వరూపుని దయజనించు। నపిమాని శరణాగతా కృతితోనుండి విశ్వసించినవాఁడైన విష్ణుకృపకుఁ। బాత్రుఁడౌచుండు నా రెండుపాయములకు। శక్తిలేకున్నవాఁడైన స్వామియనుచు। భావ్యకారులఁ దలఁచినఁ బరమపదము। హస్తగతమని మా లక్ష్మణార్యులనిరి॥ ౫

తా॥ కర్మములఁ దప్పకుండఁ జేయఁగా జ్ఞానము సంభవించు ననియు

జ్ఞానముచేత యోగాభ్యాస పరుండై నిష్ఠలో నుండఁగా శ్రియఃపతి యందు భక్తి పుట్టుననియు నా భక్తిచేత సిద్ధసాధనమైన ప్రపత్తి పుట్టుననియు నా ప్రపత్తిచేత నాచార్యోపదేశముచేతను శరణాగతుండా మెననియు. విశ్వాసము కలిగిన శ్రియఃపతి కృపకుఁ బాత్రుం డాయె ననియుఁ బ్రపత్తియైన శరణాగతికి శక్తిలేకయుండెనేని యెంబెరుమానారును నేలినయేలుకయని తలఁచినఁ బరమ పదము కరతలామలకమై యుండునని మీఁద నానతిచ్చుచున్నారు॥ (శరణాగతికి శక్తి లేకయుండెనేని యెంబెరుమానారును దలంచినఁ బరమ పదము హస్తగతమని యానతిచ్చి సంసార సముద్ర మాచార్యుఁడు దాఁటించెడు నాఁడు కాఁడాయని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ సంసారమను మహా జలధి దాఁటెడు వాఁడు విష్ణుపోతాంత నిర్విష్టశయ్యు। నడుమ సుస్థితినిల్చి నావికుండై గురు డద్దరిఁ జేర్చెద ననుచు నుండఁ। దన యత్నమున దాని దాటఁజూచి సముద్రమీఁదెదనని పోయి మునుఁగ బాందు । వానిచందంబునఁ దానును జెడిపోవుతానేల నదియేడ దాఁటు టేడ। ననుచు దయతోడ నా యోడ కధిపుఁడైన । భాష్యకారులె శ్రీనాథు పాదతీర । మాత్మవర్గంబుఁ జేర్చెడు నాక్రమంబె । తెలిపి చెప్పును లక్ష్మణదేశికుఁడు॥ ౬

తా॥ సంసారమనెడు మహాసముద్రమును దాఁటెడు వాఁడు శ్రియఃపతియనియెడు నోడలో నీయాత్మను సుఖముగా నునిచెననియు నాయోడనడుమ భద్రముగా నిలిపి యాయోడ నడిపెడు నావికుండాచార్యుండనియు నాచార్యుండీ చేతనుని నావలిదరిఁ జేర్తుననియుండఁగా నాతలంపు విడిచి తన యత్నములచేత నాసముద్రము దాఁటఁబూచె ననియు సొరకాయ బుఱ్ఱల తెప్పలను జేతఁబట్టి యీఁది పోయెదనని యీటుపోయి దురవస్థఁ బడెననియు నాలాగు తీరునఁ జేసెనేని తాను జెడిపోవుననియుఁ దానెక్కడ సముద్రమెక్కడ దాఁటి పోవుట యెక్కడ ననియు ననుచుఁ గృపతోడ నాయోడకధిపతియైనవారు శ్రీభాష్యకారులే యనియు శ్రియఃపతి తిరువడి గళనెడు నావలిదరిని నీయాత్మ వర్గములను జేర్చెడి క్రమముఁ దెలిపి చెప్పనని లక్ష్మణార్యులానతిచ్చిరి ॥ (సంసార సముద్రము దాఁటించి యెంబెరుమానారావలిదరిఁ జేర్చిరని యానతిచ్చి శ్రియఃపతి మహిమలతని తిరునామములే చెప్పుచున్నవని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ నిరుపాధిక స్వామి నిఖిలాత్మలకు విష్ణు వాసు దేవాఖ్యుఁడై వానిఁ దెలుప । వేదాంత సూత్ర తద్వివరణ కర్త శ్రీభాష్యకారులె మన